# మాయలమాలోకం



భమిడిపాటి కామేశ్వరరావు



పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

హెచ్చరిక

కేవల వినోదం నిమిత్తమైనాసరే, లేక సొమ్ము వసూలు చేసుకునే నిమిత్తమైనాసరే, ఈ ప్రదర్శనాలలో ఎదైనా సభ ఎదట ఆడదలచిన ప్రతి సంఘం వారున్నూ, ముందుగానే, గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందక పోవడం కాపీరైట్ చట్ట ప్రకారం ఒక నేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతిపొంది తరువాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

# మా య ల మా లో కం

[ మోలియర్ రచనలలో ఒకటి దీనిమాతృక. ఇది రాజమండ్రీలో ఫిబ్రవరి 1946 లో మొదటిసారి ఆడబడింది. నిర్వహించిన వారిలో శ్రీ దుగ్గిరాల సత్యనారాయణరావు, శ్రీ పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు ఉన్నారు. ]

పాత్రల పేర్లు.

1. కదంబం } వృద్ధులు, ధనికులు, స్నేహితులు
2. గరటయ్య } వృద్ధులు, ధనికులు, స్నేహితులు
3. వేణు............... ( కదంబం కొడుకు )
4. బాచి............... ( గరటయ్య కొడుకు )
5. మాలోకం......... ( బాచి నౌకరు )
6. తలుపులు............ ( వేణు నౌకరు )
7. కస్తూరి............ (కోయపిల్ల, బాచిప్రియురాలు)

రంగాల పేర్లు.

1. వేణుకి అభయం
2. మొదటి సమావేశం
3. { బాచికి అభయం<br>కదంబానికి టోపీ
4. గరటయ్యకి టోపీ
5. గరటయ్యని బాదడం
6. సవ్వారీమీద విందుకి

రంగసామగ్రి

2లో: మాలోకం – మడతటోపీ

3లో: బాచి – కత్తి

తలుపులు – సోల్జరు వేషం

– ఎర్రరంగు

– కర్రలు

కదంబం – రెండువందలసామ్ము

4లో: గరటయ్య – వెయ్యిసామ్ము

5లో: మాలోకం – దుప్పటీ, సంచీ, కర్ర

6లో: బాచి – గాజు

మాలోకం – సవ్వారీ

సమావేశాలు.

1లో: పాత్రలు 3, 6, 5

2లో: ,, 6, 5, 1

3లో: ,, 1, 2, 4: 3, 5

4లో: ,, 2, 5: 3, 4

5లో: ,, 5, 7, 6, 2

6లో: ,, 7, 2: 6, 1, 2: 5, 6: 1, 2, 3, 4, 5.

సంజ్ఞలు.

R – కుడి L – ఎడమ F – ఎదర M – మధ్య B – వెనక

# రంగం - 1

[ ఒక వీధి, చికాకుతో వేఙూ, వెనకాల నిశ్చింతగా తలుపులూ RF నించి వస్తారు. ]

వే—ఔర! నేను గృహస్థాశ్రమం పుచ్చుకున్నది మొన్న మొన్ననే. నాయిష్టం చొప్పున ఒకపిల్లని పెళ్ళిచేసి సుగుని నే కూర్చుంటే, తన యిష్టప్రకారం మరోపిల్లని వెతికి నాకోసం తెచ్చాడు గావును, మా నాన్నగారు!......చిక్కే మరీ, ఎల్లానో గాని!......( RF కేసి చూసి ) తలుపులూ!

త—అయ్య!

వే—నువ్వు వింటా ఓడ రేవులోనా!

త—ఓడ రేవులోనే

వే—మా నాన్న వచ్చేస్తున్నారని?

త—వచ్చేస్తున్నారని

వే—ఈ ఉదయాన్ని?

త—ఈ ఉదయాన్ని

వే—నాకు వివాహం చేసెయ్యడానికి?

త—చేసెయ్యడానికి.

వే—గరటయ్యగారి కూతుర్నిచ్చి?

త—ఇచ్చి.

వే—ఆ అమ్మాయి ఎక్కణ్ణించో ఓడమీద ఈ ఊరొస్తోందని?

త—వస్తోందని.

వే—వివాహం నిమిత్తం ?

త—వివాహం నిమిత్తం.

వే—ఈసంగతి మానాన్న మా బాబయ్యకి ఉత్తరం రాశారు ?

త—ఉత్తరం రాశారు.

వే—ఇక్కడి మనచర్యలన్నీ అప్పుడే మా బాబయ్యకి తెలుసునంటావ్ ?

త—ఓ, తెలుసునంటాను.

వే—నాకర్మ కాలా! నువ్వు శాస్త్ర కణికీ బిణిమాటేనా అడరా! ముక్కముక్క చొప్పునే సిరోట్టోంచి పెగించుకున్నట్టు ముల్లుపెట్టి తీసినట్టు—ఒక్కొక్క మాటేనా

త—మీకు ప్రతీ అక్షరమూ జ్ఞాపకమేగా, అల్లాటప్పుడు నేను ఇంకా నోరు చేసుకోడం ఎందుకూ ?

వే—(దీనంగా) శాస్త్రసలహా ఏడవరా, ఈ దిక్కుమాలి వ్యాపారంలో !

త—ఎల్లానండీ! నా కంగారు మీ కంగారుకంటె తక్కువా ? నేనే ఎవర్నైనా సలహాకోరాలని అనుకుంటున్నాను. (అని బుర్రగోక్కుంటాడు.)

వే—తల్చుకోని తలంపుగా మానాన్న వచ్చెయ్యమనేది, నాకొంప తవ్వింది.

త—నా కొంపా తవ్వింది.

త—వస్తోందని.

వే—వివాహం నిమిత్తం?

త—వివాహం నిమిత్తం.

వే—ఈసంగతి మానాన్న మాబాబయ్యకి ఉత్తరం రాశారు?

త—ఉత్తరం రాశారు.

వే—ఇక్కడి మనచర్యలన్నీ అప్పుడే మాబాబయ్యకి తెలుసునంటావ్?

త—ఓ, తెలుసునంటాను.

వే—నాకర్మం కాలా! నువ్వు శాస్త్ర కణిగి బిణిగి మాటేనా అడరా! ముక్కముక్క చొప్పనే నీనోట్లోంచి పెల్లగించనుట్రా ముల్లుపెకి తీసినట్టు—ఒక్కొక్క మాటేనా!

త—మీకు ప్రతీ అక్షరమూ జ్ఞాపకమేగా, అల్లాంటప్పుడు నేను ఇంకా నోరు చేసుకోడం ఎందుకూ?

వే—(దీనంగా) శాస్త్రసలహా ఏడవరా, ఈ దిక్కుమాలి వ్యాపారంలో!

త—ఎల్లానండీ! నా కంగారు మీ కంగారుకంటె తక్కువనా? నేనే ఎవర్నైనా సలహాకోరాలని అనుకుంటున్నాను. (అని బుర్రగోక్కుంటాడు.)

వే—తల్చుకోని తలంపుగా మానాన్న వచ్చెయ్యడమనేది, నాకొంప తవ్వింది.

త—నా కొంపా తవ్వింది.

వే—ఇక్కడ మనం జరిపినసంగతి మానాన్న వినడం తోటే, నా మీద చీవాట్ల వర్షం కురిపిస్తాడు.

త—చీవాట్లవర్షంతో తెమిత్తే చాలా అదృష్టం, దులిపి పారెయ్యొచ్చు. నా బాధ అదికాదు. మీరుచేసిన అడివిపన్నకి, నా మీద దెబ్బలవర్షం కురుస్తుంది. అందుకు కాసుగోవాలి నేను.

వే—అయ్యో! ఎన్ని అడ్డంకులొచ్చాయి! ఇవి ఎల్లా తొలగడం?

త—మొదట్లోనే ఉండకూడదూ మీకీమాత్రంబుద్ధి!

వే—బాబూ, నన్ను చంపకు, నీ బుద్ధిలేని మాటలతో.

త—బాబూ, నన్ను చంపకండి, మీ బుద్ధిలేని పన్నతో.

వే—అయ్యో, దైవమా! ఏమిటి గతినాకు? ఏం ఎత్తు వెయ్యను? ఏదారి పట్టను?

త—(LF కేసిచూస్తూ) అడుగోనండి, మాలోకం వస్తున్నాడు!

మా—(మంచి నిర్లక్ష్యంగా వచ్చి) ఏమండీ వేణుగారు, కుశలమా? ఏరా తలుపులూ!

వే—(నిట్టూర్పు విడుస్తాడు)

త—(ఊరుకుంటాడు)

మా—ఆఁ. ఏమిటి గ్రంథం? అసలేమిటి? ఉన్న చిక్కేమిటీ? మీరిద్దరూకూడా ఎందరో దివాలారకంగానూ కనిపిస్తారే!

వే—ఏం చెప్పను మాలోకం! నా ఆశ లడుగం టాయి, నా పని అయిపోయింది. నా అంత దౌర్భాగ్య ముండడు.

మా—ఎప్పణ్ణించీ? మొఱణ్ణించీనా, ఇటీవలాం డీ? అరెరే, అల్లా ఎల్లా జరిగిందీ?

వే—అల్లాయితే నువ్వు నా విషయం విన్నే లేదూ?

మా—అబ్బే!

మా—అబ్బే!

వే—మానాన్న, గరటయ్యగారితో కలిసి ఇక్క డికి వచ్చేస్తున్నారుట. నాకు వివాహం చేసేస్తార్ట.

మా—చేసెయ్యనీండీ! ఇందులో మీారు భయపడ డానికేముంది, లేనిపోనిదీ! ఇతడు భయపడడానికి అసలే ముందీ వివాహం మీాకైనప్పుడూ!

వే—అయ్యో, మాలోకమూ, నువ్వెరగవ్, చాలా కారణం ఉంది.

మా—ఆకారణం త్వరలో నేను ఎరుగుండేటట్టు చెయ్యడం మీాలోఉంది. బాధలోవాళ్ళని ఓదార్చడం నా స్వభావం. అందులోనూ చిక్కుల్లోఉన్న యువకుల్ని చూస్తూంటే నాకు నిద్రే ఉండదు.

వే—ఆహా మాలోకం! నువ్వు మంచి చక్కని మాలోకానివి! ఏదో ఇంద్రజాలం లేవదీసి, ఏదో పన్నా గం పన్ని, నా చిక్కులోంచి నన్ను విడదీశావా, జన్మజన్మ లకీ నీ ఋణాన్ని పడి ఉంటాను.

మా—నిజం చెప్పేస్తున్నాను. ఎత్తులు వెయ్యడంలోన్నూ మాయలు పన్నడంలోనూ నాఅంతవాడు లేడు, నాకంటె పైవాడు అసలుండడు. కాని,......ఈమధ్య అల్లాంటి వన్నీ మానేశానండీ! ఒకానొకరికీ నాకూ పట్టింపొచ్చింది, ఒక విషయంలో.

వే—అల్లానా, మాలోకం, ఏవిషయంలో?

మా—ఒక గొప్ప విషయంలో, నేనూ న్యాయదేవతా దెబ్బలాడుకున్నాం.

వే—న్యాయదేవతా, నువ్వూనా?

మా—మరే, మాకు చిన్నపేచీ వచ్చింది.

వే—నీకూ న్యాయదేవతకీనా? నాకు బోధపడటం లేదు.

మా—బోధపడితే మీరు మరోకలాఉండేవారు. న్యాయదేవత నన్ను చాలా అగౌరవపరిచింది. ఈకాలంలో కృతజ్ఞతలు ఎక్కడ చచ్చాయీ! అంత అగౌరవం......

వే—ఖైదా?

మా—అబ్బే, అటువంటి అగౌరవం నాకెప్పుడైతే జరిగిపోయిందో, ఆ తరవాత నించి నేను ఎవరికీ ఏమీ సాయం చెయ్యడం మానుకున్నాను. అయినా సరే లెండి, మీ గోష్ఠి స్పష్టంగా కానీండి, చెబుతాను.

వే—(సకిలించి గొంతిక సర్దుకుని) రెండునెల్లదాకా వెనక్కిరాం అని, నన్నగారూ గరటయ్యగారూ కలిసి ఉమ్మడి పనిమీద ఓడెక్కి వెళ్ళారు. ఎరుగుదువా?

మా—ఆ.

వే—అప్పణ్ణించీ ఈ తలుపులు నాకు సాయంగా ఉన్నాడు. గరటయ్యగారి అబ్బాయి—బాచికి నువ్వు ఆసరాగా ఉన్నావు.

లూ—అవును, నేను బాచిగారిని అంట కాగి ఉండి వారికి అమోఘంగా ఉపచరిస్తున్నాను. ఈ తలుపులు మీకు ఏం జేస్తున్నాడో గాని!

వే—త్వరలోనే, బాచి, ఒక కోయపిల్లమీద మనసు పోయాడు.

మా—ఆ సంగతి నాకూ కొంచెం తెలుసులెండి.

వే—అవశ్యంగా, ఏమైనదనుకున్నావ్, మా లోకం! బాచీ నేనూ బాల్యస్నేహితులం కాదూ, ఆపిల్లని చూడ్డానికి అతడు నన్నూ లాక్కెళ్లాడు. చూశాను. ఉందీ! సంసారి పక్షంగా ఉంది. అంతేగాని, అర్థ రంభా, తిలోత్తమా లాగ లేదు. అయితేం, బాచి ఏమంటాడో తెలుసా? ఆ అమ్మాయి అప్సరస అంటాడు. మరో విషయమే మాట్లాడ్డు. అంత ప్రభగా, అంత నేవళికంగా, అంత అందంగా, అంత తెలివితేటలతో భూమ్మీద మరెవరూ లేరంటాడు. నా మనసుకి అల్లా తోచదాయిరి. నీ మనసుకి అల్లాయెందుకు తోచటం లేదని బాచి నన్ను తెగతిట్లు! దివ్యప్రేమ మానవరూపం దాల్చి అల్లా ఉంటున్నప్పుడు తగినంత గ్రహింపు నాకు లేక పోయిన కారణంచేత నా కళ్ళు పోయాయనీ, నా చెవులు

పూడ్చాయనీ, నా ముక్కు ముక్కలైందనీకూడా అతడు అనేశాడు.

మా—మిమ్మల్ని అల్లా ఆయన అనడంలో ఆశ్చర్యమేమిటండీ, యెవరేనా అనచ్చు! ఆయన బాధ నే పడతానులెండి, మీ విషయంలోకి రండి.

వే—అబ్బ, విషయంలోకి వస్తూంటేనే, తొందర పడతావేం! ఒకనాడు ఆ అమ్మాయిని చూడడానికి ఓ పెద్ద వీధంట వెడుతూన్నాం. (సంతోషంతో) వెడుతూంటే ఏమైందీ? ఒకచోట చిన్న సందుంది. ఆసందులో...

మా—నాకు పనుంది, మీరు త్వరగా కానిండి.

తే—ఆ. ఆసందులో ఒక ఇల్లుంది. ఏడుపులు వినిపిస్తున్నాయి. బాచీ నేనూ ఆగలేక ఇంట్లోకి వెళ్లాం. చిన్న గది......ఇంతే! ఓముసిల్ది ఆవలించేసింది. ఓ దాసీదీ ఓ అమ్మాయీ ఏడుస్తున్నారు. ఇక (జాలితో) ఆ అమ్మాయి ......తన కన్నీళ్ళల్లో కరిగిపోయి ఉన్నట్టు కనిపించింది. ఆదృశ్యం ఎవరికేనాసరే ఏడుపొచ్చేట్టుంది.

మా—మీరు చెప్పడంతో ఇప్పుడు ఇక్కడ నాకే ఏడుపొస్తూంటేనే!

వే—ప్రపంచంలో కొందరూ......

మా—అబ్బ, ముందు మీమాట చెప్పండీ తరవాత కదండీ ప్రపంచం!

వే—చెబుతున్నా! నే అనబోయేది ఏమిటంటే, ప్రపంచంలో కొందరు స్త్రీలు వేషం వేసుగుని అలంకరించు

గుంటేగాని అందంగా ఉండరు. ఏది!...కాని, ఆ పిల్ల వేషాడంబరం లేకపోయినా, సహజసౌందర్యం చిమ్ముతూ ఉంది.

మా—ఓహో! అల్లా చెప్పండి మరీ, నాకు బోధపడుతోంది, కొంచం కొంచం.

వే—ఆస్థితిలో గనక, మాలోకం, నువ్వు, ఆపిల్లని, చూసుంటే, స్వామీ, ఎంతమెచ్చుగుని, వర్ణించి, ఉండేవాడ వనుకున్నావ్ ?

మా—ఓ! సందేహమేమిటీ! ఆపిల్లని చూసుండి వర్ణించి ఉంటే నాకు కవిత్వమైనా చేతైపోయి ఉండేది! అసలు యిప్పుడు కూడా నాకళ్ళకి కట్టినట్టు ఆవిడ సౌందర్యం చెల రేగి పోతోంది, మీాప్రజ్ఞ ధర్మమా అని.

వే—అందులోనూ, మాలోకం, నువ్వు గమనించావో లేదో, కొందరు కొందరు ఏడిచేటప్పుడు, వాళ్ళ మొహాలు ఏడిసినట్టుంటాయి. కాని, ఆ అమ్మాయి ఏడుపులో సైతమూ ఒయ్యారం ఒలికిపోయిందంటే నమ్ము.

మా—అవునవును. నాకా ఒయ్యారం కనిపిస్తోంది. అదుగో (అని కళ్ళుమూసి నిదానిస్తాడు).

వే—అందరికీ అప్పుడు ఏడుపొచ్చింది. 'అమ్మా' అంటూ ఆ ముసిలావిడమీదపడి ఆ అమ్మాయి ఇంకా మనోహరంగా రాగాలెట్టింది. ప్రతీవాళ్ళ హృదయమూ ఇలా చెయ్యెట్టి కలిచేసిన ట్లయింది.

మా—ప్రతీవాళ్ళూ అంటే తమరే అని వ్యాఖ్యానం గావును! తమరు ఆ పిల్లని ప్రేమించారు గావును!

వే—నే నన్నుకూడా ఏమిటి, ఎంత అడివి మృగం అంటివాడుకూడా ప్రేమిస్తాడు.

మా—మనోపని లేనప్పుడు చస్తాడాఏమిటి లేకపోతే! కాని, మీరు మీ వృత్తాంతంయొక్క పర్యవసానం చచ్చినా తేలనివ్వకుండా ఉన్నారు.

వే—ఆ అమ్మాయిని సమదాయించి మేం వచ్చేశాం. బాచిని అడిగితే ఏమన్నాడో విన్నావా ఆపిల్ల ఓమోస్తరుగా ఉంది, అన్నాడు. ఇల్లా ఉంటాయి స్నేహాలు! అంత నిర్దయగా అతనున్నందుకు ఈ విషయం అతన్తో మాట్లాడ్డం మానేశాను. అప్పణ్ణించీ నాకు చాలా ధైర్యంగా ఉంది.

త—(వేణుతో) స్వామీ, మీకు దణ్ణం, ఈ క్రమాన్ని మీరు చెప్పారంటే, భళ్ళున తెల్లార్నా తెల్లారుతుందిగాని, మన బాధేమిటో మీరు తేల్చరు, చిక్కేమిటో ఈయనకి తెలియను. అసలు ముక్క కాస్తా నే ఊదేస్తాను, మీరు గుక్కతిప్పుకోండి (మాలోకంతో) మాలోకం! అప్పణ్ణించీ ఈయనకి మతోయింది. ఆ అమ్మాయిని సమదాయించడానికంటూ వెళ్ళడమూ అక్కడ మకాం వెయ్యడమూ మొదలెట్టాడు. దాసీది ఈయన్ని అవతలకి పొమ్మంది. ఈయన బతిమాలుకుని, ప్రార్థించి. కాళ్ళమీద పడ్డారు. ఆ పిల్లా గొప్ప వంశంలోదేట. పెళ్ళాడితే తప్ప అటు రావద్దని దాసీది షరతు పెట్టింది. ఈయన బుర్ర చించుకుని, తర్కించి, వితర్కించి, ఆలోచించి, యోచించి ఎలాగో

నిశ్చయానికి వచ్చారు. సరే ఇంకెందుకు, మూడు రోజుల కిందట ఆ పిల్లని ఈయన పెళ్ళిఆడేశారు, తీరిపోయింది.

మా—సరిసరి! పెళ్ళి ఆడేశారూ, ఇంకేం, మరి చిక్కేముందీ?

త—చిక్కా చిక్కన్నారా! ఈయన పెళ్ళాడేసిన సంగతి వీరి పింతండ్రికి తెలిసిపోయింది. ఈసందడిలో రెండు నెల్లదాకా రారనుకున్న తండ్రిగారు ఉరుముగున వచ్చిపడడం, ఆయనకీ సంగతి తెలియక, తన స్నేహితుడి రెండో భార్య తాలూకు ఒకపిల్లని ఈయనకి కుదుర్చుకొచ్చినట్టు పాక్కడం...

వే—అదీకాక, ఈపిల్ల దరిద్రురాలవడం, నాదగ్గర గవ్వైనా లేకపోవడం! ఇలాంటివన్నీ గబగబా జరిగిపోయి నాయి.

మా—బస్, ఇంతేకదా! ఇంత మాత్రానికే మీరు ఇడవాలా, చెరో ఇదీనూ! కంగారుకి అవసరంలేదే! తలుపులూ, నీకు సిగ్గులేదోయ్, ఇల్లాంటప్పుడు తేలిపోతావా? మీరండి! మీ నాన్నగారూ అమ్మగారూ కలిపి ఎంతటి వారో మీ రొఖ్ఖరూ అంతటివారు గదా, ఏదో ఉపాయం చూసుగోవద్దుటండీ! వెనకట్లో అయితే, ఈ ముసిలాళ్ళని నేను ఓ ఆట ఆడించేసేవాణ్ణి, ఆలోచన చెయ్యకుండా గూడా! ఇంతప్పుడు (అభినయిస్తూ) కూడా నా ప్రజ్ఞ చూపించాను.

త—అలాంటి ప్రజ్ఞ నాకు లేదు. న్యాయ దేవతతో దెబ్బలాట నావల్ల కాదు.

వే—(కుడి మధ్య కేసి చూస్తూ) అదుగో! కర్పూరం వచ్చింది, నాకోసం.

మా—వెళ్ళి ఎందుకో కనుక్కురండి.

వే—(RM కి వెడతాడు)

మా—తలుపులూ!

త—ఒయ్!

మా—ఈ అమ్మాయేనా ఈయన భార్య?

త—ఔను.

మా—ఓ మోస్తరుగా బాగానే ఉంది.

త—ఓ. బాగానే ఉంటుంది.

మా—(అటు చూసి) చూడు చూడు, ఏడుస్తూన్నట్టుందే!

త—ను రే. ఏకధారగా ఏడుస్తోంది.

మా—ఏం చెప్మా! కొంప తీసేసి విడాకు లిమ్మంటుందా ఏమిటప్పుడే!

త—ఈ అమ్మాయికికూడా తెలిసిందేమో, వేణు గారికి పెళ్ళి చెయ్యడానికి ముసిలాయన ఒక సంబంధం కుదుర్చుగుని వచ్చాడని.

మా—అది సరేనోయ్. ఈఅమ్మాయి ఏడుపూ కొత్త పెళ్ళి ఈయనకి అవుతుందనా, లేక పాతపెళ్ళితనకి అయిపోయిందనా?

త—ఛ, ఛ అలా ఉండదు. (చూసి) వేణుగారు ఏదో ప్రమాణం చేస్తున్నారు.

మా—ఇక ఊరుకో! వస్తున్నాడీయన. ( వేణు RM నించి వస్తాడు )

ఏమండీ. ఏమన్నారు మీ కర్యారంగారు

వే—నన్ను శంకించింది, పురుషజాతికి ప్రారంభావేశం అంది. మా నాన్నమాట విని నేను ఒక కొత్త పిల్లని కూడా, కట్టుకుంటానేమో అని తనకి బాధగా ఉందని చెప్పింది. నేను అవసరం అయితే దేశమూ ప్రాణమూ వదులుకుంటానుగాని, తండ్రిమాట విననని ప్రమాణం చేశాను. దానికేంగాని, మాలోకం, ఇకనువ్వే నాకు ఆసరా, మరో దిక్కు నాకు లేదు.

మా—ఇల్లాంటి వాటిల్లో సాయం ఎంతమాత్రం చెయ్యనని నేను లోగడ నిజంగా ఒట్టెట్టుగున్నానే, కర్మం!

వే—బాబ్బాబు, నీ కాళ్ళట్టుగుంటాను. నీ ఒట్టుకి డిళ్ళ పెట్టు. ప్రతీఒట్టుకీ డిళ్ళకూడా ఉంటుందిగా! నన్ను రక్షించు, నా నావ నడుపు. నా సంసారం నిలబెట్టు.

మా—మీ సంసారమంటే మీ రొఖ్ఖరేనా? ఆ అమ్మాయి రాలేదేం నన్ను బతిమాలుకోడానికీ, రక్షించమనీ!

వే—వచ్చేదే, కాని, యెవడో ముసిలాడు ఇల్లామనికేసి వస్తున్నాడని కనిపెట్టి వెళ్ళిపోయింది. నువ్వు అభయం ఇవ్వాలి.

మా—సరే. నాకు మీమీద చాలా జాలి వేస్తోంది. ఇక భయపడకండి, నేను ఏదో ఉపాయాన్ని తంటాలుపడతాను. సరేగాని, ఒక సంగతి! మీ నాన్నగారు ఇల్లా వస్తారనుకోండి, ఆయన్ని మీరు దృఢంగా యెదుర్కోవాలిస్మండీ.

వే—చాలా దృఢంగా ఉండాలని అనుకుంటానుగాని, ఆయనగారు ఎదరపడడంతోటే నాకు ఆపాదమస్తకమూ చెమటబట్టి ఒళ్ళుకంపించిపోయి చచ్చినంతపని జరుగుతుంది.

మా—అంతపని జరక్కూడదనే నే అనేది. ఎదరపడ్డదిలగాయితూ మీరు తెగఉరిమేసెయ్యాలండీ, ఏమనుకున్నారోగానీ! అలా చెయ్యకుండా, మీరు పిరికిపడిపోయి చప్పచప్పగానసగడం మొదలెడితే, ఆయన మిమ్మల్ని లోకువకట్టేసికుక్కకి తాడోసి బరబరా ఈడ్చేస్తాడు...ఏదీ,ఆయన యెదట ఏమాత్రం దిట్టంగా ఉంటారో, ఆయన ప్రశ్నకి సమాధానం ఎంత ధైర్యంగా విసిరేస్తారో, అభినయించి నేర్చుగోండి.

వే—ఏకంగా అప్పుడే చేసేస్తానులేస్తూ, యథా శక్తిగా!

మా—అయ్యో, దూడేసే వాళ్ళంతా, అలానే అనుకుంటారండీ! ఒక్షిరవ్వ చూపించండీ, ప్రస్తుతం! చిన్న పూర్వాభ్యాసం చెయ్యండి, ముందాచరించబోయే ధోరణికీ!........ఏదేదీ, చూపు నిక్కచ్చిగా మనోదార్ఢ్యం ఒప్పేటట్టు పెట్టండి. తల ఠీవిగా, మొహం నిబ్బరంగా— (అని, తను అభినయిస్తూ) ఇలా!

వే—(అభినయిస్తూ) ఇలానా?

మా—ఇంకా తీవ్రంగా!

వే—(అభినయిస్తూ) ఇలా ఉంటే చాలా?

మా—చాలు. సరి ఇప్పుడు ఒక్ఖమాటు నేను మీ నాన్నగార్నని అనుకోండి, ఏం? సైయే?

వే—సరే.

మా—నేను గబగబా మీ నాన్నగారిలాగ మిమ్మల్ని తిడుతూ ప్రశ్నలు అడిగేస్తాను. మీరు టకటకా నిబ్బరంగా సమాధానాలు చెప్పిపారెయ్యండి.

వే—అడుగు, చూస్తాను (అని మొఖం తీవ్రంగా పెట్టి గంభీరంగా ఉండడానికి యత్నిస్తాడు).

మా—(అభినయిస్తూ) ఏంరా, ఫుంఢాకోర్, పనికి మాలిన దద్దమ్మా, దౌర్భాగ్యపుసన్నాసీ, నా అంతవాడి కడుపున చెడపుట్టావ్. నే లేనప్పుడు ఇంత ఓఘాయిత్యం చేసి నా యెదట పడ్డానికి నీ మొహం ఎల్లాచెల్లిందిరా, వాజా! నాజాగ్రత్తకి ప్రతిఫలం ఇదిట్రా, భడవా! నా దీక్షకి ఫలితం ఇదిట్రా కుంకా! నాకుతగ్గ గౌరవం ఇంతేట్రా, నక్కా!

(తెనుగా మాట్లాడుతూ) ఇదేమిటండోయ్, ఒఖ్ఖ ముక్క జబాబు చెప్పరేం? ఇంతే మీ పసా!

(అభినయిస్తూ) తండ్రి అనుమతి లేకుండా, తండ్రి చెవినేనా వెయ్యకుండా ఒళ్లు కొవ్వెక్కి గాంధర్వ వివాహం

ఏర్పాటు చేసుకున్నావుట్రా, పశువా! చెప్పరా జబాబూ, చెప్పూ, చూస్తావేం కళ్ళప్పగించీ! చెప్పూ!

(తనుగా మాట్లాడుతూ) ఏమిటండోయ్, ఇప్పుడు మీరు బొత్తిగా మతాబా కాల్చేశారే! నోరు విప్పలేక పోయారే!

వే—(గుటకేసి, కళ్ళు చికిలించి) నేను......నేను మానాన్నేవచ్చి మాట్లాడుతున్నాడని అనుకున్నాను నిజంగా!

మా—సరిసరి! అందుకోసమేగా, మీరు చవట శిఖామణిలాగ ఊరుకోకూడదయ్యా, బాబూ, అని చెప్పాను!

వే—అదంతా ఇప్పుడు కాదు. అసలప్పుడు నేను ఎంత నిబ్బరంగా ఉండి ఎంత దిటంగా సమాధానం చెబుతానో నీకే తెలుస్తుందిగా.

మా—నిజమేనా? లేక అక్కడ మేం ఎవరం ఉండం గనక, మీరెలా తగలేసినా, మీరే చెక్కేసినట్టు కోతలు కొయ్యొచ్చు గదా అని మీ ధైర్యమా?

త—(RF కిచూసి) ఇదుగో, మీనాన్నగారువస్తున్నారు.

వే—బాబో అల్లాఅయితే చచ్చాం. (అని LF కి పరుగెట్టుగు పోతాడు.)

మా—ఏమండోయ్ వేణుగారు, ఆగండి ఆగండి ఊరికే అన్నాడండీ! (చూస్తూ) అబ్బే, ఎక్కడాగుతాడూ

దాటిపోయాడు. పాపం ఎంత భయస్తుడో! ఇల్లాంటివాడు తండ్రికి సమాధానం ఏం చెప్పగలడూ ?

త — ముసలాయనతో ఏమందాం? నాకు కొత్తగూడాను!

మా — నువ్వు మాట్లాడక రాయల్లా ఊరుకుందూ నే చూస్తాను! పద! (LF కి) పోతారు.

## రంగం — 2

[ RF కేసి తిరిగి RF నించి కందంబం వస్తాడు. LF కేసి వీళ్ళిద్దరూ జరిగి నుంచుంటారు ]

క — హవ్వ! ఇంత అప్రతిష్ఠపని ఎన్నడేనా విని ఎరుగుదుమా, ఇంటా వంటా ?

మా — ( పెదిమలు బిగించి ఊగించి, కనుబొమ్మ లెత్తి, తలుపుల్ని నోరా చేత్తో తాటిస్తూ ఈయనకప్పుడే తెలిసిందిరోయ్, అన్నట్టు తలుపులకి సంజ్ఞ చేస్తాడు. )

క — మా వేణుగాడు ఎంత సాహసం చేశాడూ!

మా — ( విందాం ఉండు అన్నట్టు సంజ్ఞ చేస్తాడు )

క — ఇంతోటి పెళ్ళిచేసేసుగోడం గురించి వీడూ నాఖరూ కలిసి ఏమేమి సమర్థింపులు మొదలెడతారో వినాలి.

మా — ( నాలిక బాచితీసుగుని కళ్ళుమూసి చెయ్యి ఊపి మాకు తెలుసులేవోయ్ అనేటట్టు సంజ్ఞ చెయ్యాలి.

క—ఒక వేళ......పెళ్ళిద్దరూ...... పెళ్ళికానే లేదని డబాయిస్తారేమో?

మా—( డబాయించం అన్నట్లు అభినయిస్తాడు. )

క—లేక భృష్టాపణ కోరుకొంటారో!

మా—( కోరుకోవచ్చు అన్నట్టు అభినయిస్తాడు ) •

క—లేక కాకీపిచ్చిగా కథలుఅల్లినన్ను మాయచేసేస్తారో!

మా—( చెయ్యొచ్చు అన్నట్టు తర్జనితో అంటాడు )

క—నే చూస్తాకాదూ! మా వేణుగాణ్ణి తీసుకుపోయి, ఒకచోట పెట్టి వాడికి కాపలా వేసేస్తాను. ఇక తలుపులుగాణ్ణి ఒక పొన్నకర్రుచ్చుకుని కచాపచా చితక్కొడతాను.

త—( మాలోకం కేసిచూసి, కళ్లుతేలేసి కొంచెం కుంగి పోతూ నిట్టూర్పు విడుస్తాడు. )

మా—( వెనక్కి తప్పుకుంటాడు. )

క—( తలుపుల్ని చూసి ) ఏమయ్యోయ్, నువ్వేనా! సరి. మాకుటుంబానికి ఎల్లాంటి మంత్రిత్వంచేశావయ్యా, కుర్రాడికి ఎంత మంచిసారథ్యం చేశావయ్యా!

త—( తెల్లపోతాడు. )

మా—మీరు రావడం, లోపల చాలా సంతోషంగా ఉంది, నాకు.

క—ఇడుగో, మాలోకం, క్షేమమా! ( అని, తలుపులుతో ) ఆజ్ఞలు మా భేషుగ్గా అనువర్తించావు! మా వేణు ప్రవర్తన ఒకటోరకంగా ఉంది.

మా—మీ ముఖాన్ని బట్టి తెలుస్తోందిగానండీ, అయినా తమరు యాత్రా కులాసాగా ఉన్నారాండీ!

క—ఆ. కులాసా కేం లోటూ! (తలుపులుతో) పిదిమి కదపకుండా అల్లానే ఉండిపోయావేమిరా కొయ్య ముక్కా! (అని గుప్పిళ్ళు పట్టి పళ్ళు కొరుకుతాడు.)

మా—మీ ప్రయాణం మాంచి ఉషార్ గా ఉందాండీ!

క—ఆ. చాలా సొగసుగా ఉంది. కాని నువ్వొఖమాటుండు (తలుపుల్ని చూడకుండా) లుచ్ఛాని మొహాం వాడేటట్టు చివాట్లెయ్యాలి!

మా—చివాట్లా?

క—ఓ. వేడివేడివి.

మా—ఎవర్నండోవ్? (అని, వెకిలిగా సకిలిస్తాడు)

క—ఎవర్నా, (తలుపుల్ని చూపిస్తూ) ఈ ద్రోహిని!

మా—ఎందుకండీ పాపం!

క—సరె. ఎందుకండా-? నే లేనప్పుడు జరిగిన చర్య నువ్వు విన్నే లేదా?

మా—విన్నట్టున్నాను, ఏదో చాలా అల్పవిషయం కాదండీ?

క—అరె! అల్ప విషయమా? జరిగిన ఓ ఘాయిత్యం ఒక అల్ప విషయమా?

మా—ఆ విషయం అల్పవిషయమే అని మాలాగే మీరుకూడా ఒప్పుగోడమే యెక్కువ నయం అని నే ననుకుంటానండీ.

క—జరిగిన దారుణం పెద్ద తప్పనేనా సందేహిం
చవ్ ?

మా—(తేలిగ్గా) ఏమో! నేను ...చేపాల మని
షిని కానుస్కండి.

క—ఏమిటీ! తండ్రి అనుజ్ఞ లేందే, కొడుకు పెళ్ళి
చేసుగోడ మే!

మా—అదా. అది కొంతవరకు తప్పే అని చాలా
వరకు వాదించచ్చు గానండీ, దాన్ని గురించి మీరింత గోల
చెయ్యడం మరీ తప్పని రెట్టింపు వాదించచ్చునండీ.

క—అది నీ ఉహ. నా ఊహ. వేరు. నేను ఘోషణ
చేసి ప్రచారం చేస్తాను. మాంచి కోపం చూపించడానికి ఇది
నాకు తరుణం అంటావా అనవా ?

మా—లెక్కే మిటండీ! ఆ మాట వినగానే నాకే
కాలు కొచ్చింది. మీమీద నాకుండే అభిమానంకొద్దీ, నే
వెళ్ళి మీవాణ్ణి, నుంచున్న పాట్న పడపడా ఓ తట్టవరస
తిట్టేశాను. అతడికి నీతిబోధ యెంత భక్తిపరంగా చేశానో
వాకబు చెయ్యండి. మీకే తెలుస్తుంది. అడుగుజాడలు
ముద్దెట్టుగోవలిసిన పితృపాదుల విషయంలో ఎంత అవజ్ఞ అతడు
చేశాడో అనే విషయం గురించి నేను అతడికి ఎన్ని ఘాటు
రకం ఉపన్యాసాలు ఇచ్చానో, కనుక్కోండి...కానండీ,
మళ్ళీ బాగా ఆలోచించాను. ఆయన చేసిందాల్లో విరుద్ధం
ఏమీ లేదు.

క—అరే, మళ్ళీ అల్లా అంటూ వేమయ్యా! ఏమిటి నువ్వనే మాట! ఇందులో ఏమీ విరుద్ధం లేదూ! నాతో చెప్పనేనా చెప్పకుండా నేరుగా వెళ్ళి వాడు ఎవత్తినో పరాయిదాన్ని ముడెట్టుగోడం వైపరీత్యం కాదూ?

మా—అవునండీ, ఎవడేం జేస్తాడూ! కల్యాణం ఫిక్సీ మని తోసుగొచ్చేసింది. రాత ఎవడు తప్పిస్తాడూ!

క—ఓహోహో! ఈసబబు మా బాగా ఉంది. దగా, చౌర్యమూ, హత్యా అన్నీ చేసెయ్యడమున్నూ రాత, విధి, కర్మం అని సబబులు చెప్పడమూనా?

మా—కాదు కాదు. నామాటలకి మీరు మరీ దూరాన్వయం చేస్తున్నారు. నాఅభిప్రాయం ఏమిటంటే, (దగ్గి గాత్రం సాపుచేసుగుని) ఆ వ్యాపారంలో...ఆయన...మరీ ఎక్కువ జోక్యం కలిగించుగున్నారు.

క—పోనీ సరే, అంత జోక్యం ఎందుకు కలిగించుగోవాలీ?

మా—సరిపోయిందండోయ్! మరి యవ్వనం అంటే ఏమిటీ? కుర్ర వయస్సువాడికి ముసిలి అనుభవం ఎక్కణ్ణించి వస్తుందీ? యువకులు చాలా సబబుగా ఉంటారనుకోడం ఏం సబబండీ! ...... మాటవరసకి చెప్తాను. మా యజమాని, బాచిగారు నే నెంత చెబితేం, ఇంతకన్న ఓఘాయిత్యం చేశారు. అంతదాకా ఎందుకూ! మీరు! మీరు చిన్నప్పుడు ఎంత ఇదిగా ఉండేవారు చెబుదురూ! అని (నవ్వు తెచ్చి

పెట్టుగుని ) మిమ్మల్ని పట్టపగ్గాలుండేవా ! ఎంత విలాసంగా ఉండేవారూ ! మీ పట్టు ఎలాంటి పట్టూ, రాక్షసిపట్టూ! ప్రతీపట్టూ మీరు సాధించి మరీ వొదలిపెట్టేవారు గాని, ఊరుకునేవారా ?

క—(సిగ్గు అభినయిస్తూ ) నిజమే! నేను చిన్నప్పుడు విలాస పురుషుణ్ణే! కాని, ఇలాంటి అసందర్భాలు చేశానామరీ !

మా—లేదు! మీరు మరోలాంటి అసందర్భాలు చేశారన్నమాట! ఆయన మాత్రం ఏంజేస్తాడూ! చూశాడూ! ప్రేమ కనిపించింది. కనబడ్డ స్త్రీలంతా తన్నే ప్రేమిస్తున్నారని అనుకున్నాడు, మీరనుకున్నట్టే! ఆపిడ పోగ్గాఉంది, పోనీ అని మళ్ళీ చూశాడూ, అద్వాన్నంగా ప్రేమించాడు, వేడిగా నిట్టూర్చాడు, యథాశక్తి తపించాడు, తెగించి అడిగాడు, నేర్పుతో ఒప్పించాడు. ఇదంతా వాళ్ళవాళ్ళు కనిపెట్టి, ఆ పిల్లని ఇతని నెత్తికి రుద్ది బలిమిని కట్టబెట్టారు.

త—(తనలో) హారి ! పడగొట్టేశాడు ముసిల్దాణ్ణి!

మా—మరోటిట ! ఇతడు పెళ్ళాణ్ణని పెంకితనం సాగిస్తే ఈయన్ని కూనీచేస్తాం అన్నార్టండీ!, పెళ్ళినయమూ చావు నయమూ చెప్పండి.

క—ఇంత బలాత్కారంగా పెళ్ళిజరిగినట్టు నాకు తెలియదే !

మా—తలుపుల్ని అడగండి. ఆ కథంతా చెబుతాడు.

క—ఏంరా, మావాడికి బలిమినా పెళ్ళిజరుగుతా?

త.—(దణ్ణంపెట్టి తల ఊపుతాడు)

మా—హుఁ! నేనేమన్నా అబద్ధం ఆడగల్ననుకున్నారా?

క—లేదులే! అల్లాయితే మావాడు ఓ న్యాయవాదిని మాట్లాడుకుని చార్జి దాఖలు చెయ్యావలిసింది.

మా—ఆయన ఆపనిమాత్రం చెయ్యనన్నారు.

క—చేస్తేం! అయ్యో మూర్ఖత్వమా! ఆపెళ్ళి రద్దు చేసుగోవచ్చుగా?

మా—పెళ్ళి రద్దా?

క—మరే.

మా—మీరే ఒప్పరు.

క—ఇదేమిటే? నే ఒప్పనూ, ఆ చాటు పెళ్ళి రద్దు చేసుగోడానికి?

మా—ఒక్క నాటికి ఒప్పరోరు.

క—కొడుకుయెడల జరిగిన ద్రోహన్యాన్ని అరికట్టడానికి తండ్రికి హక్కు లేదూ?

మా—ఉండచ్చుగాని, ఆయన ఒప్పుగోరు.

క—నేను ఒప్పుగోడూ?

మా—ఎంతమాత్రం.

క—మా అబ్బాయి! (అని చొక్కా చేతులు పైకి తోసుగుంటాడు.)

మా—మీ అబ్బాయే! వాళ్ళ ఒత్తిడికి తను బెదిరి పోయాననీ, వాళ్లు చావదన్ని తనికి బలిమిని పెళ్ళిచేశారనీ చెప్పుగోడం ఎంత నీచమండీ! అసలే నీచం, మీఅంతవారి పుత్రుడికి మరీ నీచం.

క—సింగినాదం! ఏమీ భరవాలేదు.

మా—ఆలోచించండీ! తన సమ్మతినే పెళ్ళాడానని చెప్పుగోడం అతనికీ మీకూగుడా గౌరవమే.

క—ఆఁ తన సమ్మతి లేకుండానే పెళ్ళిజరిగిందని చెప్పుగోడం అతనికీ నాకూగుడా గౌరవమే అని నేనంటాను.

మా—ఆయన అలా చెప్పడని నా నమ్మకం.

క—వాడు అలా చెప్పేటట్టు నే చేస్తాగా.

మా—ఆయన అలా చెప్పడానికి ఒప్పుగోడని రాసి స్తాను.

క—మా చక్కా ఒప్పుగుంటాడు వెళ్ళవోయ్, లేక పోతే వాడికి వారసత్వం లాగేస్తాను.

మా—ఎవరు? మీరా?

క—అవునూ, నేనే.

మా—చా చా.

క—చాచా ఏమిటి?

మా—మీరు వారసత్వం మీ ప్రాణం పోయినా తీసెయ్యరు.

క—తీసెయ్యనూ?

మా — తీసెయ్యరండీ, ఎలా ?

క — ఏమిటీ ?

మా — ఉపాయం. చెప్పాగా !

క — తీసెస్తే నాకు అడ్డు ఎవరూ ?

మా — మీరే.

క — నాకు అడ్డు నేనేనా ?

మా — అవునండీ. అంతపని చెయ్యడానికి మీకు గుండె రావద్దూటండీ !

క — వస్తుంది.

మా — ఆఁ, ఎక్కడొస్తుందీ, ఊరికే అంటున్నారు.

క — ఊరికే అనటం లేదు.

మా — వాత్సల్యం అన్నింటినీ జయిస్తుంది.

క — జయించదు.

మా — అబ్బే, జయించేస్తుంది.

క — ఛీ, ఊరుకో. నేను మావాణ్ణి నిమిషంలో బేవారసుగా చేసెయ్యగల్తును.

మా — ఆఁ ఊరుకోండీ, ఎందుకొచ్చిన బేవారసు మాటలు !

క — అయితే చూపిస్తాను, చర్యా.

మా — అబ్బో, మీ హృదయంలో ఉండే దయారసం నాకు తెలుసు లేస్తురూ.

క — ఈ మాటలకేం లే ! నాకు అవసరాన్ని బట్టి కోపం బోలెడు వస్తుంది. సరే నువ్వుండు. మనిషిని తీసేస్తు

న్నావు! మరీని. (తలుపులుతో) ఒరేయ్, చవటా! నువ్వెళ్లి మావాణ్ణి పిల్చుకురా. నేవెళ్లి గరటయ్యగారిని కలుసుగుని మావాడు ఆడేసిన పెళ్లిసంగతి ఆయనతో చెప్పుగోవాలి.

మా—చిత్తం! నా అవసరంఉంటే కాకిచేత కబురంపండి, ఆజ్ఞాపించండి. పని అయిపోయిందన్నమాటే.

క—సరే సరే, (అని RF కి నిష్క్రమించబోతూ) ఆరి వేణూ! నీపని ఇదైపోనూ! వీణ్ణి బేవారసుణ్ణి చేద్దాం అంటే వీడు నాకు ఏకపుత్రుడైనాడుగదా! వెనకటి ఆపిల్ల జీవించిఉంటే నాకు లోటనిపించకపోను గదా! (అంటూ RF కి నిష్క్రమిస్తాడు.)

త—అబ్బ! మాలోకం నువ్వు అసాధ్యుడవోయ్. నీ ప్రజ్ఞ అద్వితీయం, ఒప్పుగున్నాను. మనం నెగ్గితీరతాం కాని మన కిప్పుడు కొంతసొమ్ము కావాలి. బాకీలవాళ్లు నిలవనియ్యటంలేదు.

మా—సొమ్ము నే తీస్తాను. పన్నాగం ఇదివరకే వేశాను. కొంచెం ఆలోచిస్తున్నాను. ఓ మనిషి కావాలి, కాని ఒఖ్ఖసారి ఇల్లానూడు (అని జేబులోంచి ఓ మఖమల్ టోపీ వంటిది తీసి) ఇది తలమీద కుడిపక్కకి పెట్టుగో. భయంకరంగా ముఖంపెట్టు. చెయ్యి ఇల్లా నడుందగ్గిర వెయ్యి. రాగ నాటకాల్లో చక్రవర్తి రాజు లాగ నడు. ఆ(ఆ( ఆమాత్రం చాలు! రా, వెడదాం రా. నీ కంఠధ్వని మొఖమూ సరిపోతాయి. నువ్వుచాలు, పని గడుస్తుంది.

త — మా లోకం, నీకు చాలాపుణ్యం ఉంటుంది. కాని న్యాయదేవతకీ నాకూ బేటీ రానియ్యకేం!

మా — ఫరవా లేదు రావోయ్! కష్టాలు సమంగా పడదాం. ఒకరికి రెండుమూడేళ్ళు ఎక్కువఖైదూ, ఒకరికి తక్కువాఅయినా, ధీరుడైనవాడు జంకకూడదు.

త — ఖైదంటున్నా వేమిటి?

మా — ఖైదంటేనా! ఇతరుల సౌఖ్యంగురించి శ్రమ పడేవాడికి బహుమతీ! (అని LF కి నిష్క్రమిస్తాడు. తలుపులూ పోతాడు.)

( తెర )

రంగం - 3

[ మరో వీధి. ఆమూర్దాగా గరటయ్యా, తొందరగా కదంబం ఉంటారు. RM నించి ముందు కదంబం, వెనకాల గరటయ్యా వస్తారు. ]

క — రండి, గరటయ్య బావగారు

గ — చిత్రం, చిత్రం! (అని వెనక్కి చూస్తాడు)

క — మీరు ఏదో కొంత కంగారుగా ఉన్నట్టున్నారు.

గ — ఏముందీ! ఇహానో ఇప్పుడో మా అమ్మాయి ఓడ దిగుతుందని తెలిసింది. కాని, లాభం ఏమిటీ? మనం అనుకున్నది ఒకటీ, జరిగింది మరోటీ. మీ అబ్బాయి దుష్ప్రవర్తనవల్ల పరిస్థితి తిరగబడిపోయింది.

క — బావగారూ! అందునిమిత్తం మీరు అదుర్దాపడ కండి. జరిగినదానికి ప్రతిక్రియ చేసేసి, వివాహాచరణ ఆటంక రహితం అయ్యేట్టు చేస్తాను. చెయ్యడంలో తక్షణం చేస్తాను.

గ — అది సరేనండి. కాని, కోప్పడకుండా ఉంటే ఓమాట చెబుతాను. ఈ కుర్రాళ్ళవిద్య ఉందే, దాన్ని గురించి యెంత జాగ్రత్తపడ్డా చాలడం అంటూ ఉండదని నా అభిప్రాయం.

క — అది యెంతో యథార్థం. కాని, అదెందు కిప్పుడూ!

గ — ఎందుకా! కుర్రాళ్ళ తప్పులన్నీ తండ్రులు వాళ్ళకిచ్చే తప్పుడు శిక్షణవల్లే జనిస్తాయి.

క — నిశ్చయంగా కొన్ని కొన్ని సందర్భాల్లో అంతే నండి. ఆ మాట నాతో అంటున్నా రెందుకూ?

గ — మీతో ఎందుకా!

క — మరే నాతో ఎందుకూ?

గ — ఎందుకంటే, మీరు ధైర్యం వహించి, చిన్న ప్పుడే గనక మీ అబ్బాయిని సరిదిద్దితే, అతను మిమ్మల్ని ఈ రీతిగా దగా చెయ్యకుండా ఉండేవాడు.

క — ఒస్, అదోటా! అల్లానా! అక్కడికి మీ అబ్బా యిని మీరు ఇంతకంటె ఎక్కువగా సరిదిద్దుకున్నట్టేనా?

గ — భేష్షుగ్గా, మా వాడు మీ వాజమ్మలాగ తప్పుడు పన్లు చేస్తే నేను దుఃఖిస్తాను.

క—సరిసరి. అంత చక్కగా మీరు తరిఫీయతు చేసిన మీవాడు మా కంకక..టి అప్పుడప్పు పన్లు చెయ్య డమే జరిగితే, అప్పుడు మీ కేమిటి దారి?

గ—ఆఁఆఁఆఁ......ఏమిటీ?

క—ఆఁ, మరేమిటనుకున్నారు! (అని యీసడి స్తాడు.)

గ—ఏమిటి మీ ఊహ?

క—ఏమిటా! మరొకరి లోపాలెంచి తాటాకులు కట్టడంలో తొందరకూడదు. గాజుకొంపల్లో ఉంటూ బయట వాళ్ళమీద రాళ్ళు రువ్వకూడదు.

గ—నాకు మీర నేది బోధపడటంలేదు.

క—బోధపడుతుంది, ఆట్టే తొందరపడకండి.

గ—మావాడి ఓఘాయిత్యం కూడా ఏదేనా విన్నారా ఏమిటి?

క—బహుశా విన్నాన్లెండి, అలాంటిదే ఒకటి.

గ—అయ్యో నాదశా! ఏమిటదీ?

క—మీవాడి నౌఖరు, మాలోకం, తొందరలో సహం సహం చెప్పాడు! పూర్తిగా అదేమిటో వాడేనా చెబుతాడు, ఎవడేనా చెబుతాడు. నే పోవాలి, న్యాయవాది నెవర్నైనా కుదుర్చుగుని మాట్లాడి చర్యతీసుగోవాలి, వస్తాను (అని LF కి పోతాడు.)

గ—ఔర! పిల్ల రావడం గురించి ఆదుర్దాలో ఉంటూ కుర్రాడిగురించి ఎంతమాట విన్నానూ! ఎంత చిక్కు

చ్చింది! ఏమిటోగదా మా కొంకచేసిన దారుణం! వాళ్ళ వాడు చేసిన పనికంటె పాడుపనిట కూడానూ! అదే పరమ పాడుపని ఇదెంతపాడో!

(RF నించి బాచీ తండ్రికేసి గబగబా వెళ్ళబోతాడు.) ఇదిగో ఇక్కడున్నావా? బాచీ!

బా—(పట్టుగునేటందుకు తండ్రి దగ్గరికి వెడుతూ) వచ్చారా నాన్నగారూ!

గ—(తప్పుగుని) వచ్చానుకాని, ఎడంగా ఉండు, మాట్లాడాలి.

బా—ముందు యోగక్షేమం అడగనీండి.

గ—అల్లాకాదు ఉండమంటే.

బా—మీరు క్షేమంగా వచ్చేసినందుకు నన్ను సంతోష పడనియ్యరా ఏమిటి?

గ—దానికేంలే! ముందు ఒక్క విషయం స్థిరపరుచుగోవాలి.

బా—ఏమిటది?

గ—అల్లానుంచో. నీమొహం చూడనీ.

బా—ఎందుకండీ?

గ—ఎదీ, నాకేసి తిన్నగాచూడు!

బా—ఇదుగో.

గ—నే లేనప్పుడు ఏం జరిగిందో చెప్పు.

బా—ఏం జరిగిందీ?

గ — నేను వెళ్ళగానే, నువ్వు ఏం జేశావూ?

బా — ఏం జెయ్యమంటారు, నాన్నా!

గ — ఏం జెయ్యమనడం కాదు, ఏం జేశావని.

బా — మీకు కోపంవచ్చేది ఏదీ చెయ్యలేదు.

గ — ఏదీ?

బా — ఏదీ.

గ — నువ్వు మహానిబ్బరమైన కంఠంతో మాట్లాడుతున్నావే!

బా — ఏ మాయా ఎరగను గనక.

గ — పాపం, ఎంత అమాయకుడివి! మాలోకం యావత్తూ చెప్పేశాడులే.

బా — (తెల్లబోతూ) మాలోకమా?

గ — మరే. ఏం? ఆ మాట అనేసరికి నీ రంగుమారుతోందేం?

బా — వాడు నే చేసిన పని గురించి మీతో చెప్పాడా!

గ — (వినిపించుకోనట్టు) సరే సరే సరే. ఆ వ్యవహారం మాట్లాడడానికి ఇది స్థలంకాదు; మరో చోటికి కెళ్ళాలి. ఓరి, ద్రోహీ, నాకు అప్రతిష్ఠ తెచ్చిపెట్టడానికి సంకల్పించావా? వీడు నాపుత్రుడుకాడు పొమ్మంటానుస్మీ, నీమొహం చూడను, జాగ్రత్త, అన్నా?...(అంటూ LF కి నిష్క్రమిస్తాడు.)

బా—అరె, మాలోకం! ఎంత స్వామిద్రోహం చేశాడూ! నా గుట్టు కాపాడవలసినవాళ్ళల్లో మొదటివాడు నన్ను వీధిని పడేశాడే! వెళ్ళి హాగొడవ యావత్తూ మా నాన్నతో ఊదేసి ఉంటాడు. సరే మొదట వాడి ముడుసులు విరగ్గొట్టాలి.

[ RF నించి మొదట వేణూ, వెనకాల మాలోకమూ వస్తారు. ]

వే—రా, మాలోకం, దేవుడు నాకు నిన్ను చూపించాడు.

బా—(మాలోకంతో) హావోయ్, తుంటరిలుచ్చా!

మా—నేను మీ నౌకర్ని. నన్ను మీరు అతి గౌరవం చేస్తున్నారే ఎందుకోగానీ!

బా—(కోపంతో కత్తిలాగి) నన్ను యాగీ చేస్తున్నావుగా!...నీకు బుద్ధి వచ్చేటట్టు చేద్దామని.

మా—(మోకరించి) అయ్యా!

వే—(మధ్యకివెళ్ళి) బాచీ!

బా—అడ్డం రాకు, వేణూ!

మా—(బాధితో) కాసేండీ, స్వామీ.

వే—(బాచిని పక్కకితీసి) నీపుణ్యమాయిరి, ఊరుకో!

బా—(మాలోకాన్ని కొట్టబోతూ) ఉండు, నన్ను కసి తీర్చుగోనీ, వీడిమీదా!

వే—నువ్వు మాలోకాన్ని కొడితే, మన స్నేహం మీద ఒట్టు!

మా—(లేచి, అమాయకంగా) అయితే మీకు హాని నేను ఏంజేశాననీ?

బా—ఏంజేశావనా! ఇంకా మాట్లాడతావేంరా సిఖండీ?

వే—బాచీ, తగ్గు, తగ్గు.

బా—అల్లా కాదు, వేంకా వీడు నాకు ద్రోహం చేశాడు. అది ఒప్పేసుకుంటేగాని నేను ఒప్పను. వీడి దగా నాకు తెలియదనుకున్నాడు. అది వీడు స్వయంగా ఒప్పుకుంటే తప్ప కత్తెట్టి వీడి ఒళ్ళు చిల్లులొడిచి జల్లెడ చేసేస్తాను.

మా—(స్థాయిగా) అబ్బా! మీరు అంత క్రూరులుటండీ!

బా—చెప్పేయ్, ఒప్పుకో!

మా—(కళ్ళుమూసుకుని, కనుబొమ్మల మధ్య మధ్య మాంగుష్ఠాలతో పట్టుకుని) మీకు ప్రతికూలంగా ఎదో చేశానంటారా!

బా—మరేరా శుంఠా! నీ మనస్సు నీకు సాక్షి కాదూ!

మా—మీ మాట నాకు బోధపడటం లేదండీ (అని యాదాలాభంగా చూస్తాడు.)

బా—(కొట్టబోయి) బోధపడటం లేదేం!

వే—బాచీ, తొందరపడకు.

మా—ఆఁ ఆఁ. అల్లాయితే ఒప్పుగుంటాను పట్టండీ, ఎందుకొచ్చిందీ! మరి, మీరు తెచ్చిన గొప్పసారాయి నేను తాగేసి, ఇన్నినీళ్ళు పారపోశాను అదిపెట్టినచోట. ఆ సారా అక్కడ కారిపోయిందనుకున్నారు, మీరు.

బా—ఆఁ, ఓరిద్రోహీ! అని కాజేసింది నువ్వేనా! దాసీదేమో అనుకుని, దాన్నితిట్టాను.

మా—(నవ్వుమొహంతో) నేనేనండి. (దీనంగా) అందుకు నేను చాలా విచారిస్తున్నాను.

బా—ఇది సరి, నాకు తెలిసింది వేరు.

మా—మరోటా! మరోటేదీ నాకు జ్ఞాపకం లేదండీ.

బా—(కొట్టబోయి) జ్ఞాపకం ఉందంటావా, అనవా?

వే—(బాచిని ఆపుతాడు.)

మా—అవునండోయ్, అవునవును! కోయపిల్లకి గడియారం ఇమ్మని నాచేతికిచ్చారే, అది నేనా పిల్లకివ్వలేదు, నేనే ఉంచేసుగున్నాను.

బా—ఆరి సక్కా! నువ్వే అట్టేపెట్టుగున్నావూ, ఆ గడియారం?

మా—మరేనండి భాగ్యమూ ఏమిటి, పోనీ టైం తెలుస్తుందిగదా అని చెప్పేసి.

బా—ఆహాహా, ఏం విశేషాలు చెప్పేస్తున్నావ్, నౌఖరంటే నౌఖరువి నువ్వే, ఇదీకాదు నేవిన్నది.

మా—పెద్ద ఒట్టు, మరేమీ లేదండీ!

బా—(కత్తిలాగబోతూ) ఛీ, చెప్పు.

వే—బాచీ, నీకు దణ్ణంగాని, ఆ కత్తిలాక్కు, ఇవతలకి.

మా—(అప్పుడు జ్ఞాపకంవచ్చినట్టు నటిస్తూ) మరే మరే మరే అది! ఆర్నెల్లకిందట మిమ్మల్ని ఓ దెయ్యం కఱ్ఱుచ్చుకుని బుఱ్ఱ బద్దలు కొట్టలేదూ?

బా—ఆఁ.

మా—ఆ దెయ్యాన్ని నేనే.

బా—ఆరి నిన్ను పాడుచెయ్యా!

మా—ఎం జెయ్యను మరి! మీారు రాత్రిళ్ళు ఎక్కడికో లేచి పోతూండడం చెప్పకుండా! ఆ దెబ్బతోగాని, మీా ఆటకట్టలేదు.

బా—పోనీ అదన్నా సరేనోయ్, మా నాన్నతో ఏం చెప్పావో చెప్పు.

మా—మీా నాన్నతోటా?

బా—ఓరి చోరీ! మా నాన్నతో నేనోయ్!

మా—ఆయన్ని ఇంతవరకు నే చూణ్ణేలేదు, ఓడదిగిన తరవాత.

బా—నువ్వు చూణ్ణేలేదూ!

మా—లేదండీ.

బా—ఆమాట నిజమేనా అని.

మా—అయ్యో! పండులాంటి నిజమండీ. ఆమాట ఆయనచేతే పలికిస్తాను.

బా—ఏమో మరి, ఆయనే నాతో చెబుతా.

మా—క్షమించండి, ఆయన మీతో చిన్నకోత కోశారు. (RM కేసి చూస్తూ) ఎవరో మిమ్మల్నే గావును రమ్మంటున్నారు.

బా—(RM కి చూసి) నన్నే. ఇప్పుడే వస్తా (అని వెడతాడు.)

వే—ఆ ముసిల్దెవరోచూడు, మాలోకం!

మా—(RM కి పరకాయించి) ఎవరో కోయదిలా ఉంది.

వే—ఏమంటుం దేమిటి!

మా—ఆఁ దూరం, వినపడదు.

వే—అయినా చూడు.

మా—మొదట (తర్జని చూపించి) ఇల్లా అంటోంది. తరవాత (తర్జనీ మధ్యమాలు ఆడించి) ఇల్లా అంటోంది.

బా—(RM నించి చాలా ఖిన్నుడై వస్తాడు.)

వే—ఏమోయ్, బాచీ, అల్లా డీలాపడిపోయావేం!

బా—ఏముందీ, నాయత్నం అంతా వ్యర్థం అయిపోతోంది.

వే—ఏం, ఏం?

బా—ఆ కోయవాళ్ళు ఆ పిల్లని నా కిచ్చెయ్యడానికి ఒక వెయ్యి పుచ్చుకుంటారట.

వే—ఒక వెయ్యా!

బా—మరే, పైగా అంత సొమ్మూ రెండు గంటల లోపల ఇవ్వాలిట

వే—రెండుగంటల లోపల!

బా—మరే, లేకపోతే, ఆ పిల్లని వాళ్లు తీసుకుపోతార్ట.

మా—ఒకటంటే వెయ్యి, రెండంటే గంటలునూ! నే అన్నాగా!

బా—సరేగాని, మాలోకం, నా ముద్దు మాలోకం! నీ సాయం అర్థిస్తున్నాను.

మా—(తిప్పుకుంటూ ఆడుతూ) ఓహోహో, ఇదెప్పణ్ణించీ! నా ముద్దు మాలోకంట, సెబాసు, ఇప్పుడు ఈద్రోహి ముద్దొస్తున్నాడేం! అవసరంగా మరి!

బా—నీ వెనకటి తప్పులూ ముందు రాబోయే తప్పులూ కూడా క్షమించేశాను.

మా—ఒక్షనాటికి క్షమించకండి. కత్తెట్టి తెగపొడిచి నా వొళ్లు జల్లెడ చేసెయ్యండి. ముందు సుబ్బరంగా నన్ను చంపండి. అప్పుడుగాని నాకు తోచేట్టు కనపట్టంలేదూ.

బా—అబ్బ, ఏం మాటలవీ! నా ప్రేమ దక్కించి నా ప్రాణం రక్షించు, వేడుకుంటున్నాను.

మా—అబ్బ, త్వరగా చంపండీ.

శా — ఛా ఛ, నా ప్రియతముడైనవాణ్ణి నేను చంపుకుంటానా! నీ అఖండప్రజ్ఞ సర్వాన్నీ జయిస్తుంది. ఆ ప్రజ్ఞకి దాఖలా కనపరచ మని ప్రార్థిస్తున్నాను.

మా — మాస్తారేం, ఒక్కదెబ్బ వేసెయ్యమంటే!

బా — అబ్బ, జాలివల్చి సాయం చెయ్యమంటే!

వే — కాదు మాలోకం, నువ్వు సాయం చెయ్యాలి.

మా — ఇన్ని తిట్లు పడింతరవాత!

వే — నేనుకూడా అతని తరఫున నిన్ను బతిమాల్తున్నాను.

మా — ఇంత అవమానం మరిచిపోడానికి శక్యమా?

వే — నువ్వు ఆగ్రహానికి లొంగిపోకూడదు, మాలోకం.

మా — లేకపోతేను, చట్టున చక్కావచ్చి, తిట్టేస్తున్నాడు, మహా! ముగ్గుణ్ణి తిట్టినట్టు.

బా — నా పొరపాటు ఒప్పుకుంటున్నాను.

మా — (తిరుగుతూ) ద్రోహినిట, లుచ్ఛానిట, తుంటర్నిట.

శా — నాకు నిజంగా చాలావిచారంగా ఉంది.

మా — (తిరస్కరించే మొహంతో) నా వాళ్ళంతా పొడిచి జల్లెడి చేసేస్తార్ట ఈ మొహాం!

బా — బాబూ, నిన్ను మనసారా ప్రార్థిస్తున్నాను. ఇదుగో (అని మోకరిస్తాడు).

వే — మాలోకం! ఇక నువ్వు ఆగకూడదు.

మా—అయి తేచాలు, మరి లేవండి. ఇల్లాంటిపని మరెప్పుడూ జరగనీకండి.

బా—సాయంచేస్తానను, లేస్తాను.

మా—సరి, లేవండి చూస్తాను.

బా—(లేచి) కాని, వ్యవధి అట్టేలేదు.

మా—ఆ భయంలేదు. మీకెంతసొమ్ము కావాలి?

బా—ఒక్ఖవెయ్యి.

మా—(వేణుతో) మీకు?

వే—రెండు వందలు.

మా—సరే, మీ మీ తండ్రుల దగ్గర్నించే నేను ఆ సొమ్ములు పిండాలి. (వేణుతో) మీవిషయంలో నాపన్నాగం సిద్ధంగానే ఉంది. (బాచితో) మీవిషయంలో సంగతి ఏమిటంటే మీనాన్న పరమలోభి. కాని, ఆయనతో వ్యవహారించడం తేలికే ఏమంటే, ఆయనికి బుద్ధి ఏ కోశాన్నీ లేదు. కావలిసిన మొత్తం పెద్దదైనా పని జరిగిపోవచ్చు. సరే సరే మీరిద్దరూ తక్షణం నిష్క్రమించండి. (వేణుతో) అయ్యా, తలుపులికి పని చెప్పాను. ఆ పనిమీద త్వరగా నిబ్బరంగా రమ్మని చెప్పండి. ఊఁ (అని చిటికెలు వేస్తూ వెళ్ళిపొండని సంజ్ఞ చేస్తాడు) మీనాన్న వస్తున్నారు.

[ వేణూ బాచీ LF కి వెళ్ళిపోతారు. RF నించి, ఆలోచిస్తూ కదంబం వస్తాడు. ]

మా—దణ్ణాలండి, స్వామీ!

క—(తల ముందుకి కొట్టి) ఇదుగో మాలోకం!

మా—చిత్రం! అబ్బాయిగారి ప్రవర్తనగురించి ఆలోచిస్తున్నట్టున్నారు!

క—మరే! తల్చుకుంటే గుండె చెరువవుతోంది.

మా—జీవితం సుఖదుఃఖమయమండి. అన్నీ కష్టాలే. ఒడి పట్టి సిద్ధంగా ఉండాలి కష్టాలకి. శాస్త్రం చెబుతారు చూడండీ, తమకు తెలిసే ఉంటుంది.

క—ఏమిటదీ!

మా—ప్రయాణం వెళ్ళొచ్చిన సంసారి ఇంటి వార్తలు వినడానికి సిద్ధంగా ఉండాలి—తను లేనప్పుడు ఇల్లు పోవడం, ఆస్తి పరారీ అయిపోవడం, భార్య వెళ్ళిపోవడం, కొడుకు పెళ్ళి చేసుకోవడం, కూతురు పెళ్ళి మానుకోవడం —ఇల్లాంటివి. ఇలువంటివి ఎన్ని వినపడకపోతే అంత అదృష్టం అనుకోవాలిట—అదీ శాస్త్రం!

క—శాస్త్రం బాగానే ఉంది. ఇప్పుడు దారి చూసుకోవద్దు మరి! న్యాయవాదిని చూసొచ్చాను.

మా—బాబూ, నన్నడిగితే వ్యాపారం పైసలవాలంటే మరోమార్గం చూడం. ఈదేశంలో దావాలు వేసే కంటె ముళ్ళకంపలో దూరడం నయం.

క—నాకు ఆమాటా తెలుసు. కాని, ఎంజెయ్యనూ!

మా—నేనూ ఓ మార్గం ఆలోచించి ఉంచానండి. ఏమంటారా, గొప్ప తండ్రులు ఇటువంటి బాధల్లోపడి ఉండడం నేను భరించలేను. అందులోనూ, మీరంటే నాకు ఎక్కడలేని ఇదీ ఆయిరి!

క—నీకు కృతజ్ఞుణ్ణి. చెప్పు.

మా—ఆఁ మరేంలేదండీ, ఇప్పుడు మీ కోడలుందా!

క—కోడలెవత్తీ!

మా—అదే అదే, మీ అబ్బాయి కట్టుగున్న పిల్ల. ఆ పిల్ల అన్న ఉన్నాడు. వాడు అగ్గిరాముడు! వాడు నిప్పు తింటాడు, నీళ్లు ముడేస్తాడంటే నమ్మండి! వాడు కత్తిపోటు పొడుస్తాడండీ మనిషిని—ఒక్కటే పోటు!—దాంతో మరి భోజనం అక్కర్లేదు. ఎదటి మనిషి ప్రాణాలు వాడు, ఇల్లా, ఫొటో తీసినట్టు, తీసేస్తాడు. వాడు మీ వాణ్ణి పట్టుగుని పచ్చడికింద కొడుతూంటే చూడలేక నేను అడ్డుకున్నాను. “ఆగవోయ్. అవతల దుక్కలాంటి ముసిలాయన ఉన్నాడు, తండ్రీ! ఆయనకి హక్కూ తిక్కా ధనమూ స్తోమతూ న్యాయమూ గౌరవమూ బోలెడున్నాయి. ఈపాటికి తగ్గూ! ఏదో పుచ్చుగుని ఈ పెళ్ళి రద్దు చెయించెయ్. అది నీకు లాభం” అన్నాను. దాంతో అంతటి వాడూ మెత్తపడ్డాడు. కొంతసొమ్ము పారేస్తే పెళ్ళి రద్దు చెయ్యడానికి వాడు ఒప్పేట్టే కనిపించాడండి.

క—అల్లాగా! అయితే ఏమాత్రం అడిగాడేమిటీ!

మా—అబ్బో! మొదట మరీ విరుద్ధంగా అడిగాడు లెండి.

క—ఎంతేమిటి?

మా—చాలా విపరీతమండీ.

క—అవున్లే, పోనీ ఎంతా?

మా—అయిదారు వందలు తెమ్మన్నాడు.

క—ఏడవలేకపోయాడు, పోదూ, అయిదారు వందలు వ్యాధులుకూడా తెచ్చిపెట్టమనక పోయాడూ! ఇవతల నేను చచ్చుపీనుగు నని అనుకుంటున్నాడా ఏమిటి?

మా—సరిగ్గా నేనూ అల్లానే అన్నాను. వాడిమాట చప్పరించేసి, మీరు అయిదారు వందలు వదులుకోడానికి ఆరీతిగా టోపీపడే బాపతు కాదని తెగేసి చెప్పేశాను. చాలాసేపు సంప్రతించాం, అతడు సేనలో జేర బోతున్నాడు. గుర్రం కొనుక్కోడానికిట, వంద కావాలన్నాడు.

క—పోనీ అది పారేద్దాం.

మా—గుర్రానికి జీనూ దిబ్బా అవీ కావద్దా! వాటికి ఓముప్ఫై అవుతుందట.

క—నూటముప్ఫైయా? అబ్బో! అయినా సరే ఇత్తాం.

మా—తమరు ఆగాలి, ఆగి ఒకటి ఆలోచించాలి. వాడికి నౌఖరున్నాడు.

క—సరిసరి. వాడికి నౌఖరోడా?

మా—అవునండి, ఆ నౌఖరుకి కొనేగుర్రం యాభై పెడితేగాని రాదు.

క—యాభై కాదు, సరిగదా రోలీ యివ్వను. వాడి నౌఖరుకి గుర్రమా! వాడి నౌఖర్ని నడవమను, వెధవని! నడిచి వల్లకాట్లోకి వెళ్ళమను, ఉరెట్టుగోమను. నౌఖరు వాడికీ అంటూ ఛస్తే ఏమీయివ్వను.

మా—అదేమిటండీ!

క—వాడెవడో పొగరుకుంక.

మా—నౌఖర్ని నడవమన్నారా?

క—నడవమను, రోగమా, లేకపోతే దొర్లమను వాణ్ణీ యజమాన్నికూడా వంతులప్రకారం!

మా—అయ్యా ఇంతస్వల్పంలో పెనక్కితియ్యకండి, పారెయ్యండి, న్యాయశాస్త్రపు కోరల్లో చిక్కుగోకండి, మీరు జ్ఞానులు.

క—అబ్బ, సరేనోయ్, ఇవీ ఇస్తాను.

మా—చివరికి అతనేమన్నాడూ! సామానునిమిత్తం ఒక్క కంచరగాడిద కూడా కావాలన్నాడు.

క—ఏమో! వాడి కంచరగాడిదా వాడూ నాశనం గాను! మనకి మరీ అవుతుంది. మనం దావాకే వెడదాం.

మా—అయ్యా, క్షమించి ఒప్పుగోండి.

క—ఛీ, ఛస్తే ఒప్పుగోను.

మా—అయ్యా!! కాస్తంత కంచరగాడిద గురించి అంత పట్టుడితె ఎల్లాఛస్తాం చెప్పండి!

క—ఛీ మామూలు గాడిదకూడా ఒప్పుకోను.

మా—నిదానించి, చెప్పిందివినవయ్యా... కంచర గాడిదా!

క—అబ్బెబ్బే అసలు వద్దయ్యా, గాడిదా!

మా—పోనీ చిన్నరకం ఇంచక్కటి గాడిదని కొనుక్కొమందాం.

క—అబ్బే, ఛీ, దావా వేసెయ్యడమే.

మా—దావా తేలికనిగావును మీరు తెగమురిసి పోతున్నారు. పిటీషన్లు, నోటీసులు, వాయిదాలు, న్యాయ స్థానాలు, సాక్షులు, న్యాయవాదులు, గుమాస్తాలు, న్యాయ కర్తలు, రాజీబెదిరింపులు, క్షౌరాలు, అప్పీళ్లు ఇల్లాగ్గా సవా లక్ష వ్యాపారంలో దిగితే ఒకమాటే తేలడం! దావా శత్రువుకైనా వద్దు! దావామాట తల్చుగుంటే నాకు జన్మచాలించాలని ఉంటుంది.

క—ఆమాట నిజమే నయ్యోయ్! పోనీ ఆదిక్కుమాలి కంచరగాడిదకోసం ఎంత కావాలంటాడు వాడూ!

మా—అబ్బే, ఒక్ఖ ఇరవైయండీ! ఇంతెందుకూ? అంతకీ రెండువందలు.

క—రెండువందలా?

మా—ఇంతే.

క—అబ్బే, కోర్టుకెడితేనే నయం. (అని పచారు చేస్తూ ఆలోచిస్తాడు.)

మా—సుళువు బలువులు చూసుగోండి.

క—చూసుగున్నాను, పోదూ.

మా—వ్యాజ్యంలో దిగితే మరి ఇవతలకి రాలేరు.

క—వ్యాజ్యం వేసి తీరుతాను.

మా—వ్యాజ్యానికి వెళ్ళడం అంటే ఇదేమన్నా చేతులు ఝాడించుగుంటూ భోజనానికి వెళ్ళినట్టు వెళ్ళడం అనుకున్నారా? ప్లెయింట్లకి, సమన్లకి, సలహాలకి, వాయిదాలకి, నకళ్లకి, బత్యాలకి, సాక్షులకి, వకీళ్లకి, ప్రతినిధులకి, కోర్టు ఫీజుకి, లంచాలకి, మామూళ్ళకి, ఇల్లాగ్గా బోలెడోయ్యాలి. నేను లెఖ్ఖవేశాను. వేస్తే, ఇప్పుడు మీరు దావాకి వెడితే అధమం మూడువందలు చేత్తోపుచ్చుగోవాలి. ఆదుర్దా, ఇబ్బందీ, కష్టమూ, శ్రమా జంఝాటనా అవన్నీ అల్లాఉండగా! చివరికి నెగ్గుతామో లేదో! నేనైతే ఇప్పుడు రెండు కాదు మూడువందలైనాసరే గుమ్మరించేసి, దావా మానేస్తాను.

క—నాపక్షం న్యాయం ఉందయ్యా! నాకు ఎదర ఏ లాయరు రాగుతాడూ?

మా—మీ మాట సరే, నేనైతే దావా మానేస్తాను.

క—రెండువందలు నేనివ్వను.

మా—(RF కేసి చూసి) ఇడుగో! నే చెప్పినబ్బాయి, మీకోడలికి అన్న!

క—బాబోయ్, పొడుస్తాడేమో! (అని FL కి పరిగెట్టి వెళ్ళబోతాడు.)

మా—( కదంబాన్ని తీసిగల్లీ LF దగ్గర L కేసి తిప్పి కూర్చోపెడతాడు. )

[ RF నించి సోల్జరు వేషంలో తలుపులు వస్తాడు. ]

త—( టకటకలాడుతూవచ్చి ) ఏయ్. డాం. బ్లెడీ... ... వేనూ టంగ్డి...

మా—వేణుతండ్రి కదంబంగారాండీ, ఎందుకండీ!

త—ఏయ్, డాం సిస్టర్ పెళ్ళి రద్దూ...కోర్ట్... ఏయ్...టు హండ్రెడ్...

మా—మీ చెల్లెలి పెళ్ళి రద్దుచేసుగోడానికి కోర్టుకి వెడతారో లేదో గానండి, మీరు అడిగిన రెండువందలూ ఇవ్వరట. అది మరీఎక్కువ పొమ్మంటున్నారు.

త—ఏయ్ ( అని చప్పుడుచేస్తూ కత్తిలాగుతాడు )

మా—బాబ్బాబు! ఆకత్తితో పొడవకండి.

త—ఆఫెలో కన్పిస్తే...ముక్కల్ చెక్కల్...

క—( కళ్లు చేతుల్తో కప్పుగుంటాడు. )

మా—ఏమండోయ్, సోల్జరుగారూ! మీఊహ ఏముటోగాని, వేణుగారి తండ్రి ధైర్యశాలండీ, మీకు జంకే రకంకాదు.

త—ఆయ్...డాం రాస్కెల్...ఆ రోగ్నీ చుపించు...పొడ్చేస్తా...

మా—( FL కి చూపిస్తూ ) ఇక్కడుంటేనాండీ. చూపించడానికి, ఇదుగో ఇక్కడ లేడండి.

త—ఆయ్, డాం, దేర్...

మా:—ఒహో! ఈ మనిషాండీ, ఈ మనిషి వేరండి. ఈయన మరోడూ.

త—ప్నేహిటుడా చెప్పూ!

మా—స్నేహం శాస్త్రనా లేదండి. పైగా వేణుగారి తండ్రికి ఈయన గొప్పశత్రువు.

త—సెత్రువా ?

మా—అవునండి.

త—ఏయ్. డాం, దిస్ గూస్ ఆరొడీ కదంబంకు సెత్రువా ? సంతోషం.

మా—నిశ్చయంగానండి.

క—( భయపడడం నటిస్తాడు. )

మా—ఈ చుట్టుపట్ల మీ ఆటలు సాగవండి.

త—షటప్, డామిట్, వేనూటండ్రీ ఎక్డా...

మా—ఎక్కడుంటేమండీ, ఆయన జాగ్రత్తమీద ఆయనుంటారు. ఆయనకీ బంధువులూ స్నేహితులూ నౌకర్లూ ఇల్లా బోలెడుమంది ఉన్నారు. వాళ్ళంతా ఆయనపక్షం దెబ్బ లాడతారు.

త—( LM కేసి నడిచి L కేసీ తిరిగి నిలబడి ) ఏయ్, డాం, రక్టం, యుద్ధం, వేనుటండ్రి చుపించు, పొడ్చేస్తా, టప్ఫానం. ఇక్ డా! వాడీస్నేహిటుల్ ఇర్గో రండీరా. వన్, టీస్కో ( హా అని లోపల కేక )! టూ, పుచ్కో ( అమ్మో అని అరుపు ) ట్రీ, చచ్కో ( లోపల ఏడుపు )! ఫోర్ హాయిం ( లోపల మూలుగు )!

కత్తులూ కర్రలూ తగిలినచప్పుడు వినిపిస్తుంది. కొంత ఎరుపురంగు అక్కడ పారపోసి, తలుపులు RM కి వెళ్ళి పోతాడు )

మా—( కదంబం దగ్గరకెళ్ళి ) స్వామీ రండి.

క—( కళ్ళుమూసుకునే ఉండి ) వాడు వెళ్ళాడా? వెధవ, మరీ కిరాతపశువులా ఉన్నాడే !

మా—మీరు అదృష్టవంతులు గనక కళ్లు మూసుకున్నారుగాని, నాకళ్ళ ఎదట నలుగుర్ని పొడిచి చంపి ఈడ్చుకుపోయాడు. అదుగో చూడండి రక్తం, మీ రొండు వందలకీ డణ్ణంగాని ఎంతమందిప్రాణం పోయిందో చూడండి. మరి నాకు సెలవు.

క—( లేచి, వణుకుతూవచ్చి ) మాలోకం !

మా—అయ్యా !

క—నేను ఆ రొండువందలూ ఇచ్చేస్తాను.

మా—చాలా సంతోషం. మీరు తెరిపిని బడతారు, ఇవ్వండి.

క—సొమ్ము నాజేబులోనే ఉంది, వెళ్లి ఇచ్చేద్దాం, నడు.

మా—నాచేతి కివ్వండి.

క—నీచేతి కెందుకూ ?

మా—సరే మీకు మతిపోయినట్టుంది. ఇప్పుడేగా మీరు వేణుతండ్రికారని నేను చెప్పిందీ! అదీకాక, మీరే అసలాయన అని తెలిస్తే వాడు ఇంకా కక్కమంటాడు.

క—మరేమరే, నిజమే కాని, సొమ్ము ఎవరికిస్తున్నామో వాణ్ణి చూడద్దూ.

మా—అంటే నన్ను నమ్మరన్నమాట!

క—అబ్బెబ్బే, అది కాదది కాదు.

మా—ఆఁ సోదురూ మీ లెఖ్ఖేమిటీ! నన్ను నమ్మితే నమ్మండి, లేకపోతే మానండి. రెండింటిల్లో ఏదో ఓకే! తండ్రీ కొడుకుల సఖ్యతకోసం తంటాలు పడడంతప్ప మరోటి నా హృదయంలో లేదుగదా! నేనే మిమ్మల్ని దగా చేస్తున్నానని ఇంకా మీకు బెదురుంటే, మరోణ్ణి కుదుర్చుకోండి, ఈ బండలోంచి మిమ్మల్ని ఉద్ధరిస్తాడు.

క—అయితే పుచ్చుకో.

మా—వద్దండీ, సొమ్ముదగ్గిర మాత్రం నన్ను నమ్మకండీ. ఇంకోణ్ణిచ్చి పంపుదాం.

క—(సొమ్ముతీసి) అబ్బ, ఇదుగోనోయ్.

మా—అబ్బ, మీకు చెప్పినా తెలియటంలేదే! నన్ను నమ్మకండీ! మీ దగ్గిర్నించి ఇంతోటి సొమ్మో నేను కాజేస్తానేమో, ఎవడు చూడొచ్చాడూ!

క—ఏదో జాగర్తకోసం అన్నాను. పుచ్చుకుందూ మళ్ళీమళ్ళీ అడిగించుకోక! ఏమైనా, మాలోకమోయ్, వాడిదగ్గిరగట్టి రశీదు పుచ్చుకోయేం?

మా—దానికభ్యంతర మేమిటీ? వాడు వ్యవహారించేది మూర్ఖుడుతోనా నాతోనా! (అని సొమ్ముతీసుకుంటాడు)

క—ఇంటికెళ్ళి నేను నీకోసం కనిపెట్టుగుని ఉంటాను.

మా—దూఢిగా వస్తాను, నడవండి. ( RM కి చూపిస్తూ) వాడల్లా వెళ్ళాడు. ( LF కి చూపించి) మీరు ఇల్లా దయ చెయ్యండి.

క—( LF కి వెళ్ళిపోతాడు )

మా—అమ్మ! ఇక్కడికి ఇతణ్ణి పిండడం అయింది. ఇక ఆ గరటయ్యగారి దగ్గిర్నించి లాగాలి. ( RF కి పోతాడు. )

( తెర )

## రంగం — 4

[ మాంలోకం LF నించి వచ్చి తిరిగి, ఏడుపు మొహం తెచ్చుగుని ]

అయ్యో దైవమా? ఎంత ఆపత్తు, ఎంత దారుణం! ముఖ్యంగా తండ్రిగారిది ( అనేసరికి గరటయ్య RF నించి రంగం మీదికి వచ్చి, నిర్ఘాంతపోయి వింటాడు. ) ఎంత దురదృష్టం! అయ్యో! గరటప్రభూ! మీరిప్పుడు ఏగంగలో దిగుతారో!

గ—( భయంతో నోరు తెరిచి ఏమిటి చెప్మా ఇదీ అన్నట్టు చూస్తాడు )

మా—ఆ గరటయ్యగారి కోసం నేనిప్పుడు ఎక్కడని వెతగనూ!

గ—(సమీపించి) ఏమిటి, మాలోకం, ఏమిటీ?

మా—(ఇటూఅటూ పరిగెడుతూ, గరటయ్యగారి రాక గమనించనట్టు నటిస్తూ) గరటయ్యగారిని ఎల్లా కలుసుగోవడం, ఆయనతో ఎప్పుడు చెప్పడం?

గ—ఏమి టేమిటీ?

మా—(మూలుగుతూ) తెగ వెతికినా ఆయన దొరక లేదుగదా!

గ—ఇక్కడున్నాను.

మా—(కుసిళ్ళుతూ) ఎక్కడేనా దాక్కున్నారు గావు నాయన!

గ—ఇక్కడుంటే నే (దగ్గిరికెళ్లి) ఏయ్ ఇదుగో, ఉన్నాను, నీకు కళ్లు కనిపించటం మానేశాయా?

మా—అమ్మ, దణ్ణం. మీ రేనా? ఇంతవరకు కనిపించారు కాదుగదా!

గ—చాలా సేపణ్ణించి ఇక్కడే ఉన్నాను. ఏమిటీ గొడవ?

మా—(గుటక వేస్తూ) మరండీ...

గ—ఊఁ

మా—మీ అబ్బాయండీ...

గ—ఊఁ...మా అబ్బాయి...

మా—విపరీతమైన దురవస్థలో పడిపోయారండి.

గ—ఏమిటది, ఏమిటదీ?

మా—చాలా విచారంగా ఉన్నారు. మీరు తెగ తిట్టిపోశారట—అయనన్నీ నన్నూ జాయింటుగా! ఓడల రేవు దగ్గిరికి షికారు వెళ్లాం. రేవులోకి ఓతురకఓడ వచ్చింది. ఒక యువకుడు మమ్మల్ని పిలిచి, తమ ఓడమీదికి తీసికెళ్ళి, మన్నించి, ఫలహారాలు పెట్టాడు.

గ—బాగా దివ్యంగాఉంది. అందుకు ఏడవడం అవసరం ఏమిటీ?

మా—వస్తున్నా, తొందరపడకండి! ఫలహారాలు అయేసరికి మేం నడిసముద్రంలో ఉన్నాం. నన్ను దింపి తొట్టిపడవలో ఎక్కించి గట్టుకి తోసేసి మీదగ్గిరి[illegible] మన్నారు.

గ—మా అబ్బాయో మరి!

మా—మీ అబ్బాయిని ఖైదీగా తీసుకుపోతున్నారు. వెయ్యిరూపాయిలిస్తే వొదిలి పెడతారట.

గ— వెయ్యిరూపాయిలా?

మా—మరేనండి! పైగా రొండు గంటలుమాత్రమే గడువిచ్చారు.

గ—అయ్యో! ఆద్రోహి నా నడుం విరిచేశాడే!

మా—మీప్రియపుత్రుణ్ణి మీరు విడిపించకపోతే అతడికి జన్మదాస్యం రాసింది.

గ—ఆ ఓడ తగలెయ్యా, ఆఓడ ఎందుకెక్కాడూ మా వాడూ!

మా — మొదట ఏమిటో అనుకున్నాం.

గ — సరే, మాలోకం! గబగబా పరిగెట్టి వాడివెనకాలే పోలీసుల్ని పంపిస్తున్నానని చెప్పు.

మా — అక్కడికి నే నెల్లా వెళ్ళడం? పైగా నడిసముద్రంలో పోలీసు లేమిటండోయ్! హాస్య మాడుతున్నారా?

గ — అసలా ఓడ ఎందుకెక్కాలి మా వాడూ, అంటా!

మా — ఒక్కొక్కప్పుడు దిక్కుమాలికర్మం అల్లా తోసుకుపోతుంది మనుష్షుల్ని.

గ — మాలోకం! ఈ విషయంలో నువ్వు విశ్వాసంతో పని చెయ్యాలి.

మా — చెప్పండి, ఏంజెయ్యమన్నారో!

గ — నువ్వెళ్ళి, మావాణ్ణి పంపెయ్యమనిన్నీ, సొమ్ము పోగుచేసి నేను పంపేవరకూ మా వాడికి బదిలీగా నువ్వు ఉంటాననిన్నీ, వాడితో చెప్పి అక్కడుండు.

మా — అయ్యో! మీ రేం మాట్లాడుతున్నారో మీరెరగరండీ! వాడు మూర్ఖుడటండీ, మీ అబ్బాయిగారికి బదులుగా నాబోటి వాజమ్మ నౌఖరు ఉంటానంటే ఒప్పుగోడానికి!

గ — అసలు మావాడు ఆఓడ ఎందుకెక్కాలీ, అంటా!

మా — ఏదో దురదృష్టం అని చెప్పానుకాదండీ గదువు రెండు గంటలే, జ్ఞాపకం ఉంచుగోండి.

గ—ఎంత అడుగుతున్నాడూ ?

మా—ఒఖ్ఖ వెయ్యి.

గ—వెయ్యి నాణాలే! నాణాలు అంటే చిళ్ళ పెంకు లనుకున్నాడా! వాడికి గుండెఉందా!

మా—చూసిగాని చెప్పలేమండి.

గ—వాడికి వెయ్యంటే ఎంతో తెలుసా ?

మా—తెలియకేమండీ! పదివండలన్నమాట.

గ—ఆమాటే. పదివండలూ కుళ్లుకాలువలో దొరుకుతా యనుకున్నాడా వాడు!

మా—కొందరికి సబబు ఉండదండీ.

గ—అసలు మావాడు ఆ ఓడ ఎందుకెక్కాలీ, అంటా!

మా—అబ్బ! ఆమాట ఎన్నిమాట్లూ! ఆ ఓడమాట అల్లాఉంచి, ముందు కుఱ్ఱాడిమాట చూసుగోండి. మీరూరుకుంటే అతడు మరిరాడు. గడువు ఆట్టేలేదు. (పైకిచూస్తూ, చేతులెత్తి) అయ్యో! స్వామీ, జాంచిగారూ! మీకూ నాకూ ఆఖరి చూపులు అయిపోయినాయా? ఈపాటికి మీకు సంకెళ్ళు వేస్తూంటారా? దైవసాక్షిగా నేను యథాశక్తి మీ విడుదలకోసం యత్నిస్తున్నాను. మీతండ్రిగారికి మీమీద ప్రేమ లేక పోబట్టి మీరు దూరం అయిపోతున్నారు గదా! మీ కర్మంకొద్దీ మీ కెల్లాంటి తండ్రి జన్మించారండీ!

గ — ఒక్క క్షణం, ఉండు మాలోకం! సొమ్ము తెస్తాను.

మా — త్వరగా తెండి. మళ్ళీ ఆలస్యం అయిపోతుం దేమో!

గ — వెయ్యేనా అన్నావు?

మా — అవునండీ, వెయ్యి.

గ — అబ్బా, వెయ్యా! (అంతా అన్నట్టు)

మా — మరే, వెయ్యే! (స్వల్పం అన్నట్టు)

గ — అసలు మావాడు ఆఓడ ఎందుకెక్కాలీ, అంటా!

మా — మా బాగా అన్నారు, ఈమాట! త్వరగా తెండి.

గ — షికారు మరోచోటికి వెళ్ళి ఉండకూడదూ!

మా — నిజమే. దబ్బున పట్రండి.

గ — వెధవ ఓడా వీడూను!

మా — (తనలో) అబ్బ! ఆ ఓడ ఈయన గొంతికలో చిక్కడింది.

గ — ఇదుగో, మాలోకం! చూడూ! అన్నట్టు జ్ఞాపకం వచ్చింది! కొంత బంగారం పిరాయించగా, సొమ్మొచ్చింది. జేబులోనే ఉంది. ఇంతలోనే అది ఉడాయిస్తుం దనుకో లేదు సొమ్ము పైకితీసి, ఇచ్చేటట్టు నటించి) కాని, నువ్వు మరిచి పోకుండా ఆఓడ నాయకుడితో 'ఒరేయ్, నువ్వు లుచ్ఛావి' అని నే నన్నానని చెప్పు.

మా—(చెయ్యిపట్టి) చిత్తం.

గ—"నువ్వు పరమ లుచ్ఛావి కూడానూ" అని నేనన్నానని చెప్పు.

మా—(చెయ్యి అల్లానేపట్టి) చిత్తం.

గ—'గుండెల్లేని పచ్చిప దొంగవు' అన్నానను.

మా—ఇంకా చాలా అంటాలెండి.

గ—"నాకు నువ్వు దొరికావంటే, నిన్ను నేను తినేస్తా" అని అన్నానను.

మా—చిత్తం.

గ—(సొమ్ము పొరపాటున లాగ దాచుగుని) త్వరగా వెళ్ళు, వెళ్ళి, అబ్బాయిని తీసుగురా (అని RF కి వెళ్ళబోతాడు)

మా—ఏమండోయ్, అయ్యా!

గ—ఏం?

మా—సొమ్మేదండీ?

గ—ఏం, నీకివ్వలేదూ?

మా—చూశారా, చూశారా, మళ్ళీ మీరే దాచేసుగుని!

గ—ఔరా, దుఃఖంకాదూ, మనస్సు మనస్సులో లేదు. (ఇస్తూ) ఇదుగో!

మా—నిజమే మరి, పాపం.

గ—వెధవ ఓడ, దిక్కుమాలి యువకుడు! వీడిఫలారం నాశనంగానూ! ఇంతకీ, అసలు మావాడు ఆఓడ ఎందుకెక్కాలీ, అంటా! (అంటూ RF కి నిష్క్రమిస్తాడు.)

మా—అమ్మ! ఈ వెయ్యీ ఈయనకి మళ్ళీ చేరవు. అంచేత నామీద ఋణం నిల్చిపోతుంది. నేను ఋణం అట్టే పెట్టుగోను. నన్ను గురించి ఈయన తనకొడుకుతో చెప్పిన అబద్ధానికి, వడ్డీతోసహా ముట్టచెప్పేస్తాను. (LF నించి వేణూబాచీ వస్తారు.)

వే—ఏం మాలోకం! ఏమైంది, కాయా, పండా?

బా—నా బాధ తొలిగించడానికి ఏం చాశావు, మాలోకం!

మా—(వేణుతో) ఇదుగో మీ రెండువందలూ!

వే—ఆహా, మాలోకం! ఎంతసౌఖ్యం ప్రసాదించావు!

మా—(బాచితో) మీ కేమీ చెయ్యలేకపోయాను.

బా—(వెళ్లిపోతూ) అయితే ఇక నాకు కస్తూరి దక్కదు, మృత్యువే గతి.

మా—ఆగండాగండి. అబ్బ, మీ కెంతతొందరండీ?

బా—మరి నాకు మరోదారి లేదుగా?

మా—ఇదుగో, మీరుకోరిన సొమ్ము!

బా—ఇప్పుడు నాకు జీవం పోశావు.

మా—కాని, ఒక్కషరతు పెట్టి మరీ ఇస్తున్నాను, మీకీసొమ్ము! అదేమిటంటారా, మీ నాన్నగారు నామీద ఎత్తువేశారు. ఆయనమీద నేను కసితీర్చుకుంటాను. అందుకు మీరు ఒప్పుగోవాలి.

బా—నీ యిష్టం వచ్చినట్టు, కానీ!

మా—సాక్షి ఎదట ఒప్పుగుంటున్నారన్న మాట.

బా—ఓ.

మా—(అప్పుడు సొమ్ము తీసి) అయితే, ఇదుగో, వెయ్యి తీసుగోండి.

బా—(LF కి పరిగెడుతూ) వెంటనే పరిగెట్టి నా ప్రేమమూర్తిని దక్కించుగుంటాను.

(నిష్క్రమిస్తూన్న బాచికేసి మాలోకమూ వేఁళా చూస్తూండగా, తెర)

## రంగం - 5

(ఇంకో వీధి)

[LF నించి మాలోకం వస్తాడు]

మా—(LF నించివచ్చి వెనక్కితిరిగి) రండమ్మా రండి.

కస్తూ—(అతని వెనకాల, కొంచెం భయమూ బెదురూ నటిస్తూ. కోయ వేషంలో కస్తూరి వస్తుంది)

మా—అమ్మా, మా యజమాని మిమ్మల్ని కొనేశారు.

కస్తూ—దాసీగానా?

మా—కాదండీ, బాచిగారు మా అయ్యగారు, మీరు మా అమ్మగారు.

కస్తూ—వారు మళ్ళీ వెనక్కి వెళ్ళిపోయారేం ?

మా—మిమ్మల్ని పెంచినవాళ్లు, ఏదో రహస్యం చెబుతాం, రమ్మన్నారట. ఇప్పుడే వస్తారు.

కస్తూ—ఈలోపున మరి నన్నెక్కడుండ మన్నారు?

మా—మా యజమానిగారికి వేణుగారని ఒక స్నేహితుడున్నాడు.

[ RF నించి తలుపులు వస్తాడు. ]

కస్తూ—( LF కి వెళ్లిపోడానికి యత్నిస్తుంది. )

మా—ఫరవాలేదు, ఆగండి. ఇతను మనలోవాడే, ఆ వేణుగారికి నౌఖరు. వేణుగారు ఈమధ్యనే కర్పూరం అనే పిల్లని పెళ్ళిచేసుగున్నారు. మీరు ఆ అమ్మాయి దగ్గర కూచుందురుగాని.

కస్తూ—సరే, అది సరేకాని, మీ యజమానిగారి తండ్రికి చాలా పైత్యం అని విన్నాను.

మా—మరే. మా మామగారు గరటయ్యగారికి! ఆయన పైత్యంమాట నిజమే. ఆ పైత్యం మేం విరిచేస్తాం లెండి.

కస్తూ—అది సరిగాని, మాలోకం, నువ్వేదో ఇంద్రజాలం పన్ని ఆలోభి దగ్గిర్నించి సొమ్ము లాగేశావుట. ఏదీ, చెప్పు, వింటాను.

మా—అదాండీ! మన తలుపులు అదంతా నాకంటె బాగా చెబుతాడు. తలుపులూ, ఈవిడికి ఆవృత్తాంతం చెప్పవయ్యా!

త—( ఓ, అల్లాగే అన్నట్టు తల ఊగిస్తాడు. )

మా—తలుపులూ, ఈవిణ్ణి తీసి గల్లి కర్పూరంగారికి అప్పగించు. వెళ్ళండమ్మా, నాకిక్కడ రాచకార్యం ఉంది. వస్తాను.

( LF కి కర్పూర్గీ, తలుపులూ వెడతారు. )

( క్షణంఆగి సంచీ కర్రా ఓమూల జాగ్రత్త చేసి RF కేసి చూసి ) అదుగో, గరటయ్యగారు దయచేస్తున్నారు.

గ—( RF నించి వస్తూ ఆదుర్దాతో ) ఏం మాలోకం! ఏమైంది మావాడి విషయం?

మా—ఆయన్ని క్షేమంగా తీసుగొచ్చేశానండి.

గ—( సంతోషంతో ) అమ్మయ్య!......

మా—కానండీ,

గ—మరేమిటీ?

మా—మీరు ఊహించుకోలేనంత అపాయం మీకు రానై ఉంది. మీరు ఇంట్లో పడిఉంటే ఎంత బాగుండేది!

గ—ఏమిటా అపాయం?

మా—చాలామంది మీకోసం వెతుకుతున్నారిప్పుడు.

గ—నాకోసమా?

మా—మరే. మీకోసమే.

గ—ఎవరెవరు?

మా—ఎవరా? వే గారు పెళ్లిచేసుకున్న పిల్లకి అన్న ఉన్నాడు ఒకడు. వాడు ఒక ఊహాలో పడ్డాట్ట. ఏమ

నంటే, ఆ పెళ్ళి రద్దుచేసి, మీ పిల్లని వేణుగారికిచ్చి వివాహం చెయ్యాలని మీరు ఆలోచిస్తున్నారని. మీమీద పూర్తిగా కసితీర్చుగోవాలని వాడి ఆలోచనట. వాడు సోల్జరు. వాడి స్నేహితులంతా సోల్జర్లే. వాళ్ళంతా మీకోసం చెట్టూ పుట్టా గాలించేస్తున్నారు. ప్రతివాణ్ణీ వాకబుచేస్తున్నారు, మీ ఇంటికి వెళ్ళేదార్లన్నీ కాసేశారు. మీరు ఇంటికిఏ దార్ని వెళ్ళినా వాళ్ళకి దొరికిపోతారు.

గ—( భయంతో ) నాకు దారేమిటి, మాలోకం ?

మా—నాకూ తోచటం లేదండీ, దిక్కుమాలిది. నాకూ నఖశిఖపర్యంతం వొళ్ళు కంపించిపోతోంది.........( ఏదో వినినట్టు నటించి ) బాబోయ్ ఉండండి.

గ—(R F కి వెళ్ళి వణుకుతూ నుంచుంటాడు. )

మా—( నలుముఖాలా తణిఖీ చేసి వస్తాడు. )

గ—ఎవరు వచ్చారు మాలోకం ?

మా—అబ్బే, నేననుకున్నాగాని, ఎవరూ లేరండీ.

గ—నన్ను రక్షించే ఉపాయం ఏదైనా చూసి పెట్టవ్. మాలోకం !

మా—ఒక ఉపాయం తోస్తోంది గానండి అది పన్నితే నేనుకూడా తన్నులు తినాలి.

గ—నువ్వు నమ్మిన నౌఖరువి. నువ్వేంతిన్నా సరే గాని, నన్నుమాత్రం విడనాడకు, నీకుపుణ్యం ఉంటుంది.

మా—నేను చెయ్యగలది యావత్తూ చేస్తాను. మీరు ఏదో కొంత చెయ్యకుండా మిమ్మల్ని వొదిలిపెట్టడం అనేది నాకు చాలా అధర్మంగా తోస్తోంది.

గ—నీసాయం నే మరిచిపోను. నీకు బహుమతీ ఇస్తాను.

మా—ఏం బహుమతీ ఇస్తారు?

గ—ఇదుగో ఈకోటు ఇంకా బాగా చిరిగిపోయి నాకు బిగువు అవుతుంటేం, అప్పుడు తక్షణం ఇచ్చేస్తాను, నీకు.

మా—మీ ఔదార్యం మరెవరికీరాదు! సరేలెండి. ప్రస్తుతం నాదగ్గిర ఓసంచీ ఉంది. మీరిందులో దూరి కూర్చోవాలి. (అని, దిక్కులు చూస్తాడు.)

గ—బాబోయ్, ఎవరేనా వచ్చేస్తున్నారా?

మా—లేదు లేదు, మీరు కదలకూడదు. మిమ్మల్ని మూటగట్టి నేను మోసేస్తాను. సంచీలోది గడ్డో చెత్తో అనుకుంటారు, తీరిపోతుంది. అల్లా మిమ్మల్ని శత్రువుల మధ్యనించికూడా దాటించేసి, ఇంటో పడేస్తాను. పడీపడడంతోటే మనం పెడీమని తలుపులు బిడాయించుగుని, లోపల్నించే పోలీసులకు కబురంపుదాం.

గ—(ఇష్టంతో) మహామంచి ఆలోచన!

మా—వీలైన వాటిల్లోకల్లా మంచిది. మీకే తెలుస్తుంది. (తనలో)ఆడిన అబద్ధానికి ఫలితం కనబడుతుంది.

గ—ఏమిటి అంటున్నావ్?

మా—ఏముందీ! శత్రువులు మనవశం అవుతారని! లోపలికి కూచోండి, కనిపించద్దు కిక్కురుమనద్దు. ఏంజరిగినా సరే?

గ—కదలకుండా, మెదలకుండా కూచుంటాను. (అని సంచీలో ప్రవేశిస్తాడు.)

(సంచీలో RF దగ్గర, గరటయ్య మొహం సభవాళ్ళకి కనపడేటట్టున్నా, రంగం మీదవాళ్ళకి ఏమీ కనిపించకుండానూ ఉండాలి. )

నూ—దాక్కోండి. ఒకడొస్తున్నాడిట్లా.

—(స్వరంమార్చి) హా రే, అల్లా! ఘర్టయ్యానీ సంపీయేస్తా, హెక్డా ఉన్నాడ్ దయూసేసీ చూపండి, రా

—(తనుగా) మీరు కదలకండీ.

—(స్వరంమార్చి) హాడ్గో సంచీ దగ్గ్రా మన్సి! ఘర్టయ్యా తెల్సురా, నీకీ.

—(తనుగా) మీరు గరటయ్యగారి కోసమాండి, పాపం వెతుకుతున్నారు!

—(స్వరంమార్చి) హాఁ!

(తనుగా) ఎందుకండీ వారూ!

(స్వరంమార్చి) వాణ్ణీ ఖాంచెం సంపాలీ, ఖర్రాతో ఏకాలీ, ఖత్తితో ఫొడ్చాలీరా.

—(తనుగా) సెబాసు, అవేం పన్లూ! ఆయన మర్యాదస్తుడు.

—(స్వరంమార్చి) షెంషేర్, ఆదూ బైతు, ముఠుగం, సైతాన్.

—(తనుగా) ఒఖ్ఖనాటికి అల్లాంటివారు కారండి.

—(స్వరంమార్చి) నీకీ ష్నేఘుంరా వాడూ?

—(తనుగా) అవునండి.

—(స్వరంమార్చి) షరే, ఖావోరా, ఖావోరా, ఖావో...షలాం షలాం! (అంటూ కర్రపుచ్చుకుని సంచీని బాత్తూ)

—(తనుగా) బాబో, కొట్టకురా, బాబో, కొట్టకురా! (అని మామూలు గొంతికతో ఏడ్చినట్టునటిస్తాడు.)

గ—(బయటికిచూసి) అయ్యో, మాలోకం! ఇది నేను భరించలేను.

మా—(ఏడుపు ముఖంతో) అబ్బ, నన్ను మా చెడ్డ దెబ్బలు కొట్టాడండి. ఒళ్ళు పచ్చిపుండైంది.

గ—ఏడిసినట్టుంది, నన్నా కొడతా!

మా—(మూలుగుతూ) అబ్బ, కుమి చాలి. నన్నే నండీ.

గ— ఏమిటి నీ ఊహా? దెబ్బలబాధలు నాకు కలిగితే నే, ఇప్పుడుకూడా ఇంకా అల్లానేఉంది.

మా—అబ్బ, కాదండీ! ఆ కర్రచివరభాగం మీ మీద పడిందేమో!

గ—అయితే నువ్వు కొంచెం దూరంగా నుంచోపో యావూ వొదిలిపోనూ!

మా—(RB కేసి చూస్తూ, గరటయ్యని సంచీలోకి తోసేసి) వెళ్ళండి, దాక్కోండి షరోడొస్తున్నాడు. వీడు నిజంగా చంపేస్తాడు. (స్వరంమార్చి) ఏయ్, డాంబెగ్గర్, గర్టయ్యా వేర్?

( తనుగా ) బాగా, దాక్కోండి.

( స్వరం మార్చి ) ఏయ్, మ్యాన్, నీవు చుపించు.

(తనుగా) గంటయ్యగారు ఎక్కడున్నారో నేను ఏమీ ఎరగనండీ! ఎందుకండీ ఆయనా ?

( స్వరంమార్చి) బుర్రపైనా స్టిక్ పెడ్తాం, ఛెస్టులో కత్తి పెడ్తాం, అంతే.

( తనుగా ) ఆయున్ని పొడిచి చంపుతారాండీ! అయితే క్షమించండి, నే నెరుగను.

( స్వరంమార్చి ) ఆ సంచీ, వాట్ ?

( తనుగా ) ఈసంచియాఅండీ, నాబట్టలున్నాయండి, ఇందులో!

( స్వరంమార్చి) ఓ డ్రెస్! నిజం నాట్ నిజం? చుపించు.

(తనుగా)వీల్లేదండి! నాబట్టలిప్పుడే ఇస్త్రీచెయించాను. పైకి తీస్తే మాసిపోతాయండి.

(స్వరంమార్చి)యూ, డాం. టేక్ దట్, దట్ దట్... గుడ్ బై.

(అని, ఆసంచీని బాత్తూ, గొల్లుమని అసలుస్వరంలో తనకే దెబ్బలు తగిలినట్టు గోలచేస్తున్నాడు మధ్యమధ్య.)

గ—( తలపైకిపెట్టి) అబ్బ నాఎముకలు పొడుంఅయినాయి.

మా—నేను చచ్చేపోతున్నాను.

గ—నువ్వు మాట్లాడుతూంటే, నావీపు బద్దలుకొట్టాడేంవాడూ ?

మా—(గరటయ్యకి కనపడేట్టుభయం నటించి R B కేసి చూస్తూ) తరవాత చెబుతాను దాక్కోండి. ఈమాటు ఇద్దరు ముగ్గురు వస్తున్నారు.

గ—(భయపడి, దాక్కుంటాడు.)

మా—(కీచుగా) గర్టయ్య వడీ ఆణ్ణీ తున్నా తున్నా సంపేస్తాం. నేన్ హిటూ హెత్కా తా! (బోసిగా) గరటా ముని ఈకత్తితో చీరుస్తా. ఇల్లాపోయి వెతుకుతా.

(మందరంలో) ఇదుగో వాడినౌఖరు! చెప్పరా! రండ్రోయ్!

గ—(తలపైకెత్తి మాలోకం ఒక్కడే ఈగోలంతా చేస్తూన్నట్టు కనిపెట్టి మళ్లీ దాక్కుంటాడు)

మా—(కీచుగా) ఆఁ నీకీ సెప్కాపోతే, నిన్నే బాదీ యేస్తాం.

(తనుగా) నేను చెప్పనండీ! ఏమిటి మీనిర్బంధం!

(మందరంలో) లేకపోతే, కాస్కో—

(అంటూ సంచీ కొట్టడానికి, సంచీ సమీపించేసరికి, గరటయ్యచూసి, లేచి ఇవతలకొచ్చి)

గ—ఆరి, స్వామిద్రోహీ! బందిపోటూ, రాడీ! ఇల్లాకూసీ చేస్తావుట్రా నన్నూ!

(అంటూ తరుముకెళ్ళేసరికి, మాలోకం L B కేసి పారిపోతాడు.)

గ—ఆరి శనివెధవా! వీణ్ణి పట్టించి, కాళ్ళూ చేతులూ విరగ్గొట్టేస్తాను. మొదట రెండు మాట్లూ కూడా సందేహం

వేసింది. కాని, నిజమేమోఅనుకున్నాను. ఇంతా చేస్తాడని కల గంటామా! చంపేస్తా కుంకని!

[ అని మాలోకం పరిగెట్టిన దిశలోనే పోతాడు. తెర ]

రంగం – 6

[ RB నించి నవ్వుకుంటూ కస్తూరి వస్తుంది ]

కస్తూ—( గరటయ్యని చూడకుండా ) అబ్బ, అబ్బ! ఎంత తమాషాగా ఉందీ, పన్నాగం! కాస్త ఊపిరి తీసు గోవాలిబాబూ, నవ్వే సరికి ఆయాసంకూడా వచ్చిందీ!

గ—( LB కేసీ తిరిగి ఉండి ) ఇంతకి ఇంతా ముట్ట చెప్తాలేరా, నక్కా!

కస్తూ—( గరటయ్యని చూడకుండానే ) అహాహ్హా. ముసిలాడు ఎల్లా దగా పడ్డాడో! ( అని ఇంకా నవ్వుతుంది )

గ—( కస్తూరినిచూసి ) ఇహ్హిహ్హి. ఇదేమీ నవ్వే విషయంకాదు. నవ్వమని నిన్నెవరూ బొట్టెట్టి పిలవనూలేదు.

కస్తూ—ఎందుకు నవ్వకూడదండీ? మీ అభిప్రాయం ఏమిటీ?

గ—నా అభిప్రాయమా! అట్టే నవ్వఖర్లేదమ్మా నన్ను చూసి అని.

కస్తూ—మిమ్మల్ని చూసి ఎవరు నవ్వారూ?

గ—నువ్వే! నువ్వు నామొహంకేసి చూసి తెగ నవ్వడం లేదూ?

కస్తూ—అదా! నాకు నవ్వువచ్చిన కారణం మీరు కానేశారు. ఓ కథ గురించి నాలో నాకు జ్ఞాపకం రాగా నవ్వొచ్చింది.

గ—కథా, జరిగిందా?

కస్తూ—జరిగిన కథే. ఆ కథంటే నాకు ఎక్కువ మక్కువ బయట్టేరిందేమో చెప్పలేనుగాని, అంత సారస్యంగా ఎదీ ఉండదు.

గ—ఏమిటి చెప్మా అదీ!

కస్తూ—అదా! ఓ అబ్బాయినొఖరు ఆ అబ్బాయి తండ్రిని మాయచేసి సొమ్ములాగడం! అహ్హాహ్హా!

గ—అబ్బాయా...నొఖరా...మాయా...సొమ్మూ ఆఁ ఆఁ...జొరా.

కస్తూ—మీరు కోరితే చెబుతాను. నాకు తెలిసిన సారస్యాలు మరొరితో చెబితేగాని నాకు తోచదు.

గ—ఎదీ చెప్పు.

కస్తూ—సంతోషంతో చెబుతాను. ఈ సంగతీ అందరికీ ఎల్లానో తెలిసి తీరుతుంది లెండి. నాసంగతీ అంతే, నన్ను నే నెరగను. నేను కోయవాళ్ళల్లో ఉన్నాను. వాళ్ళు తిరుగుతూ టారు. ఈ వూరొచ్చారు. ఓ అబ్బాయి నన్ను చూసి పెళ్ళాడతానన్నాడు. వాళ్లు కొంతసొమ్ము ఇమ్మన్నారు. అతని దగ్గిర లేదు. అతని తండ్రి పరమలోభి. ఆయన పేరు ఎదో ఉండాలండీ, ఇట్టే మరిచిపోయానూ! ఈ ప్రాంతంలో మట్టికూడా తినే లోభిపేరు ఎదేనా మీకు తెలుసా?

గ— తెలియదు.

కస్తూ—ఆయనపేరు గమత్తుగా ఉంటుందండీ...... రాటం... రాటీ... గరాటీ... ఆc... గరాటు... కాదు, గర టయ్యి. అదేఅదే ఆ ముసిలాడిపేరు. నన్ను కోరిన అబ్బా యుకి ఒక నౌఖరుండబట్టిగాని, లేకపోతే ఆసామ్మీ ఆ గర టయ్యి దగ్గిర్నించి ఊడిపడకపోను. ఆ నౌఖరుపేరు మాలో కం. మాలోకం చాలా అఖండుడండీ, అతణ్ణి ఎంతేనా మెచ్చు గోవచ్చు!

గ—హారి వాణ్ణి పాతరెయ్యా! మెచ్చవలిసిందే మెచ్చవలిసిందే! (అంటూ పళ్లుబిగించి మెచ్చుతాడు.)

కస్తూ—అహ్హాహ్హా! వాడి ఉపాయం విన్నారా! తల్చు గుంటే నవ్వొస్తుంది. (నవ్వి) వాళ్లిద్దరూ ఒక ఓడ రేవుకి షికారు వెళ్లినట్టూ, ఓ యువకుడు వాళ్ళని ఓడమీాదికి తీసి గెళ్లి ఫలహారం పెట్టినట్టూ, (నవ్వి) ఫలహారం అయేసరికి ఓడ నడిసముద్రంలోకి వెళ్లినట్టూ, నౌఖర్ని మాత్రం నేల మీాదికి పంపేసి ఆ అబ్బాయిని వాళ్లు ఖైదీగా ఉంచేసుగుని, వెయ్యిపట్టుగొస్తేగాని వదలం అన్నట్టూ!! (నవ్వి) మన ముసిలాడూ, మనలోభీ, మనకోపిష్టీ మాడిపోయినట్టూ! ఆయన తనకొడుకునా సొమ్మునా వదులుకోడం అని తటపటా యించినట్టూ! (నవ్వి) నాన్చి నాన్చి భయపడి సొమ్మిచ్చి నట్టూ, జవాబు చెప్పవలిసొచ్చి నప్పుడల్లా 'అసలు మా వాడు ఆ ఓడ ఎందుకెక్కాలీ, అంటూ!' అంటూ అతడు

అదేమాటగా ఉన్నట్టూ, ఇల్లాగ్గా అద్భుతంగా ఉంది ఆ కథ. మీరు ఏమీ నవ్వటంలేదే! ఏమంటారు మీరు ?

గ—ఏమంటానూ! ఆ అబ్బాయి కేవలం పనికి మాలినవాడమ్మ అంటాను. మహానుభావుడైన వాళ్లనాన్న వాణ్ణి చావగొట్టి చెవులు మూస్తాడంటాను. నువ్వే నీ అంతరం మరిచిపోయి గొప్పింటి యువకుణ్ణి ఆశించడంలో చాలా దుడుకుతనం కనపరిచావంటాను. సరి, ఆ మాలోకం శుద్ధ రాక్షసప్పీనుగు గనక వాణ్ణి బలిమిని పట్టి గరటయ్యగారు వాణ్ణి ఉరితీయించడం యూఢి అంటాను. ( అంటూ తొందరగా LF కి నిష్క్రమిస్తాడు. )

త—( RF నించి వస్తూ ) ఏమమ్మా! ఎక్కడికీ వెళ్తున్నారు ? ఇప్పుడు మీరు మాట్లాడినాయన మీ ప్రియుడుగారి తండ్రే తెలుసా ?

కస్తూ—నేను అల్లానే చివరికి అనుమానిస్తున్నాను. ఆయనెవరో తెలియక ఆయన కథే ఆయనకి చెప్పేశాను తమాషా కోసం.

త—ఆయన కథేమిటీ! టోపీపడి పొమ్మివ్వడం అదీనా! ఇందాకా, నేను చెప్పింది.

కస్తూ—అవును. అదిచాలా బాగుంది. ఎవరి తోటే నా చెబితేగాని నాకు నోరు ఆగలేదు. అయితేం లేస్తూ! ఆయనే బాధపడ్డారు నాసంగతి ఇంతకంటె పాడూకాదు, బాగూపడదు, పోనిస్తూ.

త—మీరు ఇల్లా నోరు జారడంలో చాలాతొందర కనపరిచారు, అధమం మీ వ్యాపారాల్లో నేనా మీకు గుట్టుండద్దూ! అయ్యో!

కస్తూ—ఆఁ పోదూ. నేను కాకపోతే నా తాత వ్వరోడు చెబుతాడు ఆయనతో! కథ, అల్లాంటిది.

(LM నించి కదంబం 'తలుపులూ' అని కేక వేస్తాడు.)

త—(LM కి చూసి) అదుగో కదంబంగారు అంటే మా యజమాని తండ్రి. నన్ను పిలుస్తున్నారు. మీరు (RM చూపించి) ఇల్లా వెళ్లిపొండి. ఈ కథ మళ్ళీ చెప్పకండి, ఎక్కడా!

కస్తూ—(RM కి నిష్క్రమిస్తుంది.)

క—(LM నించి వచ్చి) ఏంరా, తలుపులూ! ఆ మాలోకం కుంకా, ద్రోహివి నువ్వూ, మా పుత్రపాదగట్టా మీ ముగ్గురూ ఏకమై నాసొమ్ము లాగేస్తే, నేను నోరుమూసుగుని కూచుంటాననుకున్నారా? వేషాలేస్తావురా నాదగ్గిరా?

త—అంతా మాలోకం చేశాడండి, ఆ దగా వ్యాపారంలో నేనేమీ వేషం వెయ్యలేదండి.

క—ఆలోచించి చెబుతానుండరా, ద్రోహీ! చూద్దాంలే ఉండు. నీపని చెప్తాలే. ఒట్టిపుణ్యానికి నాకంట్లో కారం చల్లి నన్నుగాడిదని చేస్తారా! సరే, సరే. వెళ్ళి తీసుకురా వేణుని! (అని తలుపుల్ని కొట్టడానికా అన్నట్టు కవ్విస్తాడు.)

త—(భయపడి) చిత్తం. చిత్తం (అని RM పరిగెడతాడు)

గ—( LF నించివస్తూ ) కదంబంగారూ! మీకోసమే
చూస్తున్నాను. నేను మహాదురవస్థలో ఉన్నాను.

క—నేనూ గొప్పవిచారంలో ఉన్నాను.

గ—వాడు చచ్చిపోనూ, ఆ మాలోకం, నాదగ్గిర
వెయ్యి పట్టుకుపోయాడు.

క—అమ్మో. ఆ చచ్చినాడే, నా దగ్గిర రెండువం
దలు లాగేశాడు.

గ—నాదగ్గిర డబ్బుకాజెయ్యడమే కాదు, ఇంకా
ఎంతేశాడనుకున్నారు! నేను ఫలానా అని చెప్పడానికి వీల్లే
నంత అమర్యాద నాకు చూపించాడు. అందుకుతగ్గ అనభం
వాడికి ఉంది లెండి!

క—నన్ను మాయచేసినందుకు వాడికి శిక్షవే
యిస్తాను.

గ—నన్ను పెట్టిన బాధలకి వాణ్ణి ఉరితీయించి ఊరే
గిస్తాను. వాడిమాట సరేగానీ, కదంబంగారూ, చిక్కులు
తండ తండాలుగా గాని రావంటారు.

క—ఇంకా ఏం జరిగిందీ?

గ—మా అమ్మాయీ వాళ్ళూ ఓడమీద వస్తా
రేమో అనుకుంటున్నామా! వాళ్లు బయల్దేరి చిరకాలం
అయిపోయిందిట. ఆ ఓడ ఏమయిందో! ఆ పిల్ల మరి నాకు
దక్కేదేమిటీ!

క—అన్నట్టు, మీరు చెప్పినమాట ఒకటి జ్ఞాపకం
వస్తోంది. మీ అమ్మాయి ఉంటూన్న ఊళ్ళో, మీరు
పూర్వం మారుపేరుతో ఉండేవారు గావును గా!

గ—అవును నిజమే.

క—అయితే, ఆ పేరాయనతాలూకు జనాని మని చెప్పి, ఇక్కడ ఎవరేనా లోగడ దిగారేమో వాకబు చేద్దాం రండి, ఈపక్క రేవుకి వెడదాం.

గ—మనమూ మళ్ళీ ఓడరేవుకే! పోనీ మీరు కెళ్లి రండి.

క—మీఅమ్మాయి సంగతి కనుక్కోడానికి మీరు లేకపోతే ఎల్లా?

గ—(చిరాకుపడి) నిజమే. నిజమే; నడవండి (ఇద్దరూ LF నుంచి వెళ్ళిపోగా, మాలోకం RF నుంచి జాగర్తగా వస్తాడు. ధైర్యంగా పచారుచేసి, ఏదో సందేహం తోచి వెనక్కి వెళ్ళి మళ్ళివచ్చి, ఇల్లాగ్గా, కాస్సేపు కాలం గడుపుతూ)

మా—వ్యాపారాలు పెళ్ళిళ్ళు! నిలబెట్టింది యువతుల్ని! దగా చేసింది కర్కోటకుల లాంటి ముసిలాళ్ళని—వాళ్ళపిల్లల నిమిత్తమే! నేను స్వలాభం కోరలేదు. సొమ్ము సొమ్ములోనేఉంది. ఎటొచ్చీ గరటయ్యగారికి దేహశుద్ధి చేశాను. వీళ్ళు నన్ను ఏమేమి శిక్షలు చెయ్యాలనుకుంటున్నారో తెలుసుగుని, మళ్ళీ ఆలోచించి ఆ శిక్షలు దాటుకోవాలి! వాళ్ళు తలుపుల్ని పట్టుగుని తమదగ్గిరే అట్టేపెట్టుగుంటే, నాకు సంగతి ఎల్లాబోధపడుతుందా అని ఆలోచిస్తున్నాను. కానీ, నా సంకల్పం, పరసౌఖ్యం గురించి కదా!

నిరీక్షిస్తాను! (అని కళ్లు మూసుగుని, చేతులు కట్టుగుని, MF దగ్గిర నుంచుంటాడు.)

త—(LF నించి వంగెట్టుగుని వస్తూ) ఏమోయ్, మా లోకం!

మా—ఏమిటి సంగతులు?

త—రెండు! మొదటిది, వేణుగారి చిక్కు విడిపోయింది. రేవుదగ్గిర వాకబు చెయ్యగా, గరటయ్యగారి అమ్మాయి ఇక్కడికి వెనకే వచ్చేసినట్టు తెలిసింది. వేణుగారు పెళ్ళాడిన కర్పూరం అనే అమ్మాయేట గరటయ్యగారి అమ్మాయి! ముసిలాళ్ళ సంకల్పాన్ని భగవంతుడు ఆమోదించి నట్లైంది. అక్కడికది బాగానే ఉంది.

మా—మరి, రెండోసంగతి!

త—ఏముంటుందీ! నీకు తగ్గశిక్ష ఏమిటా అని బెదిరించేస్తున్నారు, ముసిలాళ్ళు! అందులో ముఖ్యంగా గరటయ్యగారు!

మా—బెదిరింపుల్లో ఏముందోయ్! బెదిరింపులు మేఘాల్లాగ్గా పైనించి పోయే బాపతు!

త—అయినా సరే నువ్వు జాగర్తపడడం మంచిది. ఒకొక్కప్పుడు చివరికి తండ్రులూ కొడుకులూ ఏకమై నౌఖర్లని జారవిడిచేస్తారు.

మా—ఫరవాలేదు. వాళ్ళకోపాలు తగ్గించెయ్యడం నాకు తెలుసులే...సరేగాని, వాళ్ళదగ్గిర్నించి నువ్వెల్లాగ రాగలిగావూ?

త—వేణుగారిని తీసుకురమ్మని నన్ను పంపిస్తే ఇల్లా వచ్చేశాను. ఈపాటికి ఆయనే కనపడి ఉంటాడు, వాళ్ళకి.

మా—అయితే, నువ్వు నాతో, రా! చిన్న పన్నాగం ఒకటిపన్ని వెళ్ళిపోదుగాని! (అని RF కి తలుపుల్ని తీసుగుని వెళ్ళిపోతాడు. LF నించి గరటయ్యా, కదంబం, వేణూ వస్తారూ.)

క—అబ్బాయి, వేణూ! ఈ పెళ్ళిగురించి...... ,

వే—ఏమో నాన్నగారూ! మీమాట నేను వినదల్చుకోలేదు.

క—కాని, నువ్వెరగని విషయం ఏమిటంటే......

వే—నేను ఎరుగున్న విషయాలు చాలులెండి.

క—నేచెప్పేదీ. గరటయ్యగారి కూతురే...

వే—గరటయ్యగారి కూతురు నాకు సుతరాంవద్దు.

గ—మాపిల్లనే......

వే—మీఉపన్యాస అసలు అక్కర్లేదండి. క్షమించండి. నాఆలోచన నాది.

క—నీభార్య...

వే—నాభార్య నాకు ఏర్పడింది. మీరెవ్వరూ బాధ పడకండి.

క—ఓరి వెర్రినాయనా! నువ్వు నీయిష్టప్రకారం చేసుగున్నపిల్లే గరటయ్యగారికూతురని తేలిందిరా! నీమాటే నీదిగాని, మామాట చొరవనియ్యవేం!

వే—అదా! అయితే, సంతోషమే.

గ—మరి ఇంటికి పదండి, మాట్లాడుకుందాం, మా అమ్మాయిని ఎక్కడో దాచావుగావును తీసుకురావోయ్, వేణూ!

[ R M నించి కస్తూరిని తీసుకుని తలుపులు వస్తాడు. ]

త—( గరటయ్యతో ) మీ బాచిగారు ఇప్పుడే వస్తాం అన్నారండి. ఇదుగోనండి మీ కోడలుగారు! మీ అబ్బాయిగారు రావడం ఆలస్యం అయిపోతోందని ఆయనకోసం ఈవిడ వెదుకుతూంటే నే తీసుకొచ్చాను.

గ—( ఆశ్చర్యపడి ) సరిసరి! ఈ అమ్మాయిని నాయింట్లో అడుగెట్టనియ్యనా! నాకు తెక్కాలుకొచ్చే కథ నాకు చెప్పింది, తమాషాట, సారస్యంట!

కస్తూ—(సవినయంగా కుడిపక్క నిలిచి నమస్కరించి) అయ్యా! క్షమించండి. మీరెవరో నాకు తెలిసి ఉంటే, నేను ఆ వృత్తాంతం మీతో చెప్పిఉండను. తప్పు మన్నించండి.

గ—ఆడకూతురివి గనక క్షమించాలే. ( తనలో ) అయితే మాత్రం పరాయి సామాన్యప్పిల్లని నాకొడుక్కి ఒప్పుతానా!

బా—(R M నించి వగరుస్తూ వచ్చి గరటయ్యగారితో) నాన్నా! క్షమించాలి. నే ప్రేమించిన పిల్ల గొప్పవంశంలోదే. కోయవాళ్లు ఆ అమ్మాయిని వెనక ఎత్తుకు పోయారట.

అప్పటి బంగారంగాజు ఏకటి ఇచ్చారు. దీన్నిబట్టి తెలుసుకో వచ్చునేమో, ఇదుగో!

క—ఏది ఏదీ! (ఆప్యాయనంగాచూసి) ఈగాజునిబట్టి చూస్తే, ఈపిల్ల నాకూతురే! నాలుగేళ్ళ వయస్సప్పుడు మాయమైంది.

గ—మీ కూతురా?

క—అవును. నా కుమార్తె. మొహం నిదానంగా చూస్తే, పోలిక జ్ఞాపకం వస్తోంది. (వాత్సల్యంతో కస్తూరిని చూసి) అమ్మా, రా!

గ—ఆహాహా! దైవకృప! ఏమి అద్భుతాలు! కాని, నా వెయ్యి......

(LF నించి "ఓం ఓం ఓం ఓం" అనే కేకలు వినిపిస్తాయి.)

ఇదేమిటి చెప్మా, చివరికీ! సవ్వారీలా ఉందే! చూసిరా తలుపులూ!

త—(LF కి పరిగెట్టి అప్పుడే వచ్చి) పాపంమాలోక మండి!

గ—పాపమేమిటి! వాణ్ణి ఉరి తీయిస్తా!

త—అవసరంలేదండి. అతడు ఓయింటి పక్కనించి వెడుతూంటే పైనించి ఓ పెద్దరాయి పడి తలకాయి రెండు చెక్కలైందిటండి. తీసుగుపోతూన్నారు. ఓ మాటు ఇల్లా తీసుగురానిస్తే, మీతో ఆఖరి వాక్యాలు చెప్పేస్తాడట.

[ అని LF కి వెళ్లి తను ఒక చివర పట్టుగుని, రెండో చివర ఎవరో లోపలఉండి సాయంచెయ్యగా, ఓ కటుకులాంటిది రంగంమీదికి పెడతాడు. దానిమీద బుర్రకి కట్టుకట్టి, ఒళ్ళు దెబ్బలు తగిలినట్టు కనిపిస్తూ, ఆఖరి ధోరణిలో ఉన్నట్టు నటిస్తూ మాలోకం పడుకుని ఉంటాడు ]

మా—అయ్యో, అయ్యో... నేను చాలాచిక్కులో ఉన్నాను. మరణంతో పోరుతూన్నాను... (బాధనటిస్తూ) అబ్బ అబ్బ! (అని కొంత లేవడానికి యత్నించి) ఎవరెవర్ని నేను బాధించానో, వారి క్షమాపణ కోరుకుని మరీ వెడతాను... నేను పోయేలోపల అంతా క్షమించండి నన్ను... ముఖ్యంగా, కదంబంగారు. గరటయ్యగారు!...

క—మాలోకం! నిన్ను నేను క్షమించాను, ప్రశాంతంగా మరణించు.

మా—(గరటయ్యతో) అయ్యో, గరటయ్య గారూ! మీకు నేను మరీబాధకలిగించాను. మీరు సంచీలో ఉండగా, కర్రతిరగేసి...

గ—ఇప్పు డదంతా ఎందుకులే!

క—ఏమండీ! మిమ్మల్ని గాని, కర్రదెబ్బ లేమన్నా కొట్టాడా ఏమిటి, సంచీలో దూరమని!

గ—ఆఁ వాడిపిండం! వాడికి సంధించిండండీ! సంధి మాటలు ఇల్లానే ఉంటాయి.

మా—నాకు ఈ చివర గడియల్లో పట్టుగున్నపరమ దుఃఖం ఏమిటంటే,... మిమ్మల్ని కర్రతో...

క—ఔరా, ఊరుకోమంటేను!

మా—ఏ కళనఉన్నానో మిమ్మల్ని కర్రతో అదే బాదడం...

క—ఉరుకుంటావా లేదా! నిన్ను పూర్తిగా క్షమించాను.

మా—చాలా సంతోషం. మీరు ఎంతో మంచివారు. మీరు హృదయపూర్వకంగా క్షమించినట్టేనా! నేను మిమ్మల్ని కర్రతో పిండి కింద...

క—ఆ ఆ ఆ, నోరెత్తకు సర్వం క్షమించాను. నీకు శిక్ష దేవుడే చేశాడు.

మా—అయ్యో! మీ మాటలవల్ల ఎంత ఆరోగ్యం వస్తోందనుకున్నారు! ఇప్పుడప్పుడే మరణించేటట్టు లేను.

క—అల్లాఅయితే, నువ్వు మరణిస్తేనే నిన్ను క్షమిస్తాను.

మా—అదెల్లాగండీ ?

క—ఏమో! నువ్వు బతికితే నిన్ను క్షమించను.

మా—అల్లాయితే, నాకు బాధ ఎక్కువైపోతోందండోయ్! (అని పక్కమీద వాల్తాడు)

క—కరటయ్యగారూ! మనం షరతు ఏమీ లేకుండానే ఇతణ్ణి క్షమిద్దాం. ఆయుర్దాయం ఉంటే బతుకుతాడు, మనకేం! మనం అంతా అనుకోనంత సుఖంగా ఉన్నాంకదా.

క—సరే అల్లా కానీయండి!

అయ్యా, అంతా భోజనాలకి పదండి. సంగతులూ, సౌఖ్యాలూ చెప్పుగుందాం.

మా—(పక్కమీద కొంచెం లేచి) మరి నామా టండి!

క—నువ్వానూ! తలుపులూ! ఇతణ్ణి భోజనాల దగ్గిరికి సాయం పట్టించు.

మా—(లేచి, నంచుని, కట్లుతీసేసి) నేనే వస్తాను నడవండి! [అనగా, అందరూ చప్పట్లు కొడుతూండగా, గరటయ్య నిర్ఘాంతపడి చూస్తూండగా, తలుపులు మాలోకాన్ని కరకంపనం చేస్తూండగా, తెర]

స మా ప్తం

# పెళ్లి కంట్రోలు

[ "మోలియర్" రచించిన వినోద నాటకాలలో ఒక దానికి ఇది అనుసరణ. ఇది 25-2-50 తేదీని, ఆర్ట్సుకాలేజీలో, పూర్వవిద్యార్థి సమావేశ సందర్భంలో మొదటిసారి ప్రదర్శించడానికి ఉద్దేశింపబడినది. ముఖ్యనటులు శ్రీదుగ్గిరాల సత్యనారాయణ రావుగారు, శ్రీపాలగుమ్మి వీరభద్రేశ్వరరావుగారున్నూ ]

## పాత్రలు

శానయ్య } వరసకి అన్నాదమ్ములు
హయగ్రీవం }

రాజ్యం } అక్కాచెల్లెళ్లు
అయస్కాంతం }

వలరాజు—రాజ్యానికి వరుడు

మాలోకం—వలరాజు నౌఖరు

రంగం - 1

[ రెండవ మూడవ తెరల మధ్య, చిన్నబల్లా మూడు కుర్చీలూ ఉండాలి. శానయ్య ఒక కుర్చీమీద కూర్చుంటాడు ]

శా—( LM కేసి చూసి. ఈలవేసి చూసి, చిటిగె వేసిచూసి, చప్పట్లు కొట్టి చూసి, రాజ్యం పైకి రాకపోగా) ఏయ్! రాజ్యం!

రా—( పక్కనించి గట్టిగా ) ఓయ్! ఎందుకూ! ( అంటూ వచ్చి LM దగ్గర ఆగాలి ).

శా—( నిస్పృహగా) అబ్బ! అంతగట్టిగా అరుస్తావే? ఓయ్ ఓయ్ అంటూనూ? పిలిచినప్పుడు ఎల్లా పలక మన్నానూ! ( నసుగుతూ తలతిప్పుతూ ) 'ఓయ్' అనాలి, తెలిసిందా? ముసుగు కప్పుకుని రావాలి. వచ్చి తలవంచు కుని నిలబడాలి. తెలిసిందా?

రా—( గట్టిగా ) ఆ.

శా—అదె. అదీ తప్పే! ( కళ్లుమిటకరిస్తూ తల తిప్పుతూ ) 'ఆ' అనాలి. 'ఇల్లారా' అంటాను. ఎల్లావస్తావో చూపించు.

రా—( గబగబా వస్తుంది )

శా—ఛీఛీ! అది తప్పు ( తక్కుతూ తారుతూ నడిచి చూపించి ) ఇల్లా రావాలి. తొందరగా రమ్మంటే ఇల్లా మెడముందుకి ఊపుతూ ( నడిచి చూపించి ) రావాలి. ఒక్కొక్కప్పుడు నాకు చికాకు వేసుగొచ్చి — "ఒకసారి

చెప్పనీ లక్షసార్లు చెప్పనీ ఎక్కడా ఇంగితజ్ఞానంలేని పశువు లాగనే ఉన్నావు'' — అంటూ గబగబా నేను కేకలు వెయ్యొచ్చు. అప్పుడు నువ్వు మందంగా 'నే ఏంజేశానూ! అంతకోపానికి!' అనాలిగాని మళ్ళీ నువ్వుకూడా అదే వేగంతో నాలిక ఝాడించావా, నిన్ను నేను శిక్షించవలి సొస్తుంది. ఏదీ అను. (అంటుంది). ఒప్పుగున్నాం. తల ఇంకా కొంచెం ఊపాలి. నిన్ను గురించి ఇన్నిపాట్లు ఎందుకు పడుతున్నానో తెలుసా?

రా — తెలియదు.

శా — నిన్ను మీనాన్న నాకప్పగించి చచ్చిపోయాడు. నీకు తగ్గ శిక్షణ ఇప్పించి సంరక్షణ చెయ్యమన్నాడు. నీకు మంచి సంబంధం చెయ్యమన్నాడు. నాకు ఏలుగాడుండి, నాకు ప్రైముంటే, నిన్ను చేపట్టేదికూడా నేనే అయితే మరీమంచి దన్నాడు.

రా — చిత్తం. మరిమా అయస్కాంతం. అక్కయ్య మాట!

శా — మీ అక్క అయస్కాంతాన్ని మా అన్నయ్య వేలువిడిచిన అన్నయ్య - హాయగ్రీవానికి మీనాన్నే అప్పగించాడు. వాళ్ళగోల నీకెందుకూ! నువ్వు నాకు ఇక ఒక వారంలో భార్య కాబోతున్నావు గనక, నే గీసిన గిరి దాటకూడదు, నే పెట్టిన ఆజ్ఞ మీరకూడదు.

రా — చిత్తం. విధేయురాల్ని.

శా—నా చిరిగిపోయిన పంచెలూ చొక్కాలూ కుట్టుకుంటూ, హాయిగా, ఆదర్శ గృహలక్ష్మిలాగ ఇంట్లో కూర్చో. ఎక్కడికేనా వెళ్లవలిసొస్తే నేకూడా ఉండి నిన్ను తీసుకెడతాను. తుంటర్లు జాస్తీగా ఉన్నారు, నీకు కాపలా అవసరం. నువ్వు లోపలికెళ్లు. (RM చూపించి) ఇల్లా వెళ్ళి ఇప్పుడే వస్తాను. ఎవళ్లో తిరుగుతున్నట్టున్నారు (RMకి వెడతాడు)

రా—(LM కేసి తిరిగి కర్మం అనుకుంటూ నిష్క్రమించ బోతూంటే L F నించి అయస్కాంతం వస్తుంది.)

అ—రాజ్యం!

రా—(వచ్చి) రా, అక్కా! కూచో.

రా—(కుర్చీమీద కూచుని) ఏమమ్మా ఎల్లా ఉన్నావు? నీకనిగ్రహం ఏడీ? నిన్ను ఇంటో పెట్టి తాళం వెయ్యకుండా వెళ్లాడేం ఈ వేళా?

రా—ఇప్పుడే (RMకేసి చూపించి) ఇల్లా వెళ్ళాడు. ఇక్కడే ఎవళ్లో తుంటర్లున్నారుట, వాళ్ళని శిక్షించడానికిట! ఇప్పుడే వచ్చిపడతాడుగా, అందుకని తాళంవెయ్యలేదు!

అ—హాంతో షికారు రా, ఎన్నాళ్లని మగ్గిపోతావు కొంపలో! హెచ్చుతగ్గువస్తే నే కాసుకుంటాను.

రా—బాబో, రాను. నువ్వేరగవ్. ఆయన యముడు

అ—నిన్ను చూస్తే జాలేస్తుంది, రాజ్యం. నాయజమాని ఇతనికంటె చాలా పెద్దవాడైనా ఇతనికిమల్లే పశువు మాత్రంకాడు.

రా—అది నీఅదృష్టం నా రాత ఇల్లాఉంది.

శా—(R M నించివస్తూ) ఇదుగో, అయస్కాంతం! క్షేమమా! (రాజ్యంతో) పరాయివాళ్ళు రాగానే లోపలికి పోవాలని చాలాసార్లు బోధించానే!

రా—మాఅక్కయ్యేగా!

శా—అయినాసరే, నాకు భయంలేదు. 'పర' అంటే తనుకాక ఎవరేనా అన్నమాట. ఆమాటకొస్తే నేనుకూడా నీకు 'పర' వెళ్ళు. (అని చేత్తో L M కేసి వెళ్ళమన్నట్టు శాసిస్తాడు.)

అ—మరిదిగారు అంతపట్టుడం ధర్మంకాదు. నేనూ చెల్లెలూ కాస్సేపు యోగక్షేమం చెప్పుగోడానికి మీరు ఒప్పుగోవాలి. ఓకడుపుని పుట్టినవాళ్ళంగదా!

శా—సరే, నా ఎదటే కూచుని పైకిమాట్లాడుతూ క్షణంలో పూర్తిచెయ్యండి, మాటలు.

(L నించి వచ్చేహయగ్రీవాన్ని చూసి)

రావయ్యా, అన్నయ్య! నాజూకుతనం నలిగిపోకుండా జాగ్రత్తగా, రా!

హ—(వచ్చి, LF పక్కకుర్చీలో కూచుంటూ) శాన య్యా, నువ్వులోకవిరుద్ధంగా! వేషం వేసుగోడం మానవుకదా! లోకాన్ని ధిక్కరించి జ్ఞానికావడంకంటె, లోకాన్ని అనుస రించి మూర్ఖుడనిపించుగోడం మంచిదని నేనులంటాను. ఆటోపీ ఏమిటి, తమ్ముడూ?

శా—( తేలిగ్గా ) ఆఁ. గొడుగు అక్కర్లేకుండానూ!

హా—ఆ గుండీలకోటు!

శా—వెచ్చగా ఉంటుంది, తిండియొక్క అరుగుదల హెచ్చు చేస్తుంది.

హా—ఆ కిర్రుచెప్పులు?

శా—వంశంలో అనుశ్రుతంగా వస్తున్నాయి. రాత్రెళ్లు తేల్నీ, జెట్టీనీ బెదరగొడతాయి. నా వేషం నాయిష్టం, అందుకని, ఓ హాయగ్రీవం అన్నయ్యా! నా వేషం నీ కిష్టంగా లేకపోతే నీ కళ్ళు మూసేసుగో, వేలునుబట్టి పొడి చేసుగో చాకిస్తాను.

హా—అది కాదోయ్, తమ్ముడూ!

శా—అదేనోయ్, అన్నయ్యా!...సరేకాని, మీ రిద్దరూ వచ్చిపడ్డారు జోడుగుళ్ళ బారులాగ, ఏమిటి కథ?

అ—గాలిషికారు వెడుతున్నాం, రాజ్యాన్నికూడా మాతో పంపండి.

హా—పంపించు, తమ్ముడూ, పంపించు. దేవుడిచ్చిన మంచి గాలిలో వాళ్ళని ఆనందించనీ!

శా—మంచి గాలా? ప్రతీ ఇంట్లోనూ లక్షగాలి ఉంటుంది. చూసిచూసి వామకోడం నేర్చుకోలేదు గాని నీబోటి గాడు! నీకు దణ్ణంగాని, హాయగ్రీవం, నేను పంపను.

హా—కాని, యవ్వనంలో...

శా—యవ్వనంలో బుద్ధి ఉండదు, కొందరు కొందరికి ముసలి తనంలో బుద్ధిఉండదు.

హా—హూ అయస్కాంతంతో ఉండడం రాజ్యానికి హాని అనా, నీ ఊహ?

శా—ఎంతమాత్రం కాదు, నాతో ఉండడం ఎక్కువ క్షేమం అని.

హా—కాని...

శా—కానేమిటి? ఈ పిల్ల బాధ్యత నాది. వీళ్ళనాన్న మాటప్రకారం, రాజ్యానికి సంరక్షకుణ్ణీ, (సిగ్గుతో) కాగల భర్తనీ నేను. ఆ అయస్కాంతం సంరక్షకుడివి నువ్వు. ఎవడి నిశ్చితం వాడిది. నీక్షోభ నువ్వు పడుదూ, నాగోల నీకెందుకూ!

హా—కాని, నాకేమని అనిపిస్తుందంటే,...

శా—నాకేమని అనిపిస్తుందంటే, పబ్లిగ్గా చెబుతాను, నాదృష్టే సమంజసం అనీ, నాశిక్షణే సిసలనీనూ! నా పద్ధతి నిదానం, నీధోరణి చలాకీ! ఈవిడ విడిగా ఉండాలంటాను నేను, ఆవిడచుట్టూ చెలికత్తెలుండాలంటావునువ్వు! ఈవిడికి కుదురు అలవాటు చేస్తున్నాను నేను, ఆవిడికి తిరగడం మప్పాలంటావు నువ్వు! ఈవిడ పరుల్ని చూడకూడదంటాను నేను, ఆవిడ వెనకాల జనం పరిగెట్టవచ్చునంటావు నువ్వు! జాగర్త మానవశరీరం దుర్బలం, తుంటర్లు ఉండగల్రు అంటాను నేను, ఫరవాలేదయ్యా అంటావు నువ్వు!

రా—అయ్యా, నేనెప్పుడైనా, మీ...

శా—నోరు, ముయ్యి, మేము, అనగానేను, పక్కని లేకుండా, షికారు వెడతావేం?

అ—ఏమండీ, శానయ్యగారూ...

శా—ఏమమ్మాయి, నాచేత మాటలు దండగ పెట్టించకు, నీ తెలివికి నేనుచాలను.

అ—నా చెల్లెలు నాతో ఉండడం మీకు కిట్టదా?

శా—మనస్సులోమాట చెప్పేస్తున్నాను, నీ మూలాన్ని ఈ పిల్లకూడా ధ్వంసం అవుతుంది నువ్వు ఇక్కడికి వస్తూండడం నాకు చాలా కష్టంగా ఉంటుంది. ఇంతటినించి నువ్వు ఇక్కడికి రావడం మానేస్తే నీకు ఋణపడి ఉంటాను.

అ—సరి, నామనస్సులోమాట చెప్పేస్తున్నాను. నా చెల్లెలు తెలివితక్కువది కాని, నేనైతే నీకాపలా వ్యర్థం చేసి, నీ అనుమానం ఖాయపరుస్తాను. నిరంతరం కాపలా పెట్టవలసిన అవసరం కలది గౌరవమేనా? ఇంకోరి గౌరవం గురించి నీకు బాధఎందుకు? దొంగాడు వేలుకొరుకుతాడు జాగర్త—అనడం ఇటువంటిదే.

శా—అన్నా! నువ్వెంత బలేమాష్టరువి? విన్నావా నీ శిక్షణయొక్క ఫలితం? విని ఇంకా మాట్టాడక ఊరుకుంటావేం, నాలిక దిమ్మెసకొట్టినట్టు?

హా—విన్నా విన్నా, అయస్కాంతంమాటల్లో సత్యం లేక పోలేదు. అనుమానాలూ, తాళాలూ, గడియలూ, సుగుణాన్ని పెంచవు. నిర్బంధంచోప్పాన సుగుణంగాఉండే వ్యక్తియొక్కశీలం అధమం. అంతఃకరణని ఏలడానికి అనురాగంతప్ప ఇతరశాసనం వ్యర్థం. స్వాతంత్ర్యం ప్రతిజీవికీ హక్కు.

శా—ఈమాటల్లో బుద్ధి చిన్నమెత్తైనా లేదు.

హ—చిన్నవాళ్ళ చిన్నతప్పులు చప్పరించెయ్యాలి. వాళ్ళ వేషాదికానికి ఒప్పుగోవాలి. ప్రపంచపాఠశాలలో పడితే వాళ్లేనేర్చుగుని తీరతారు, గ్రహిస్తారు. అయస్కాంతం నన్నే పెళ్లాడాలని వీళ్ళనాన్న శాసించాడు, కాని, నేను అట్లాఅనను. ఆమెఇష్టం, ఆమెహృదయం వేరొకడిమీద ఉంటే, ఆమెను అతనికే వివాహం చేస్తాను.

శా—ఆహాహా! మాఅన్నయ్యో మాఅన్నయ్యో! ఏమి మాటలతీపి! పంచదారా తేనే రంగరించి పారేస్తున్నావే, ద్రాక్షరసంలో!

హ—ఇంతెందుకూ! తండ్రులు త్వరగా చచ్చిపోవాలని పిల్లలు కోరుకునేటట్టు ఉండే నియమాలు తండ్రులు పాటించ కూడదు.

శా—సరేనయ్యా! పెళ్లివరకూ కొంత స్వాతంత్ర్యం ఇస్తే, ఆ తరవాత వీళ్ళు వెనకటి అలవాట్లు మార్చుకోకపోతే?

హ—ఎందుకు మార్చుగోడం?

శా—ఎందుకా?

హ—అవును.

శా—నువ్వెక్కడో చవటలా ఉన్నావే, నాకు తెలియదు.

హ—పేరు పాడై పోతుందా?

శా—అయితే నువ్వనేమాట, పెళ్లితరవాతకూడా స్వాతంత్ర్యం ఇస్తానంటావు!

హా—ఎందుకు ఇవ్వనూ!

శా—షోకేళాగా వేషం వేసుగోనిస్తావు?

హా—తప్పకుండా!

శా—వెఱ్ఱిమృగంలాగ ప్రతీ పార్టీకీ తయారు కానిస్తావ్?

హా—ఓ, యాధిగా!

శా—ఈవిడకోసం జనాన్ని రానిస్తావ్!

హా—రానివ్వకేం?

శా—వాళ్ళు బహుమతీలూ అవీ తెస్తూం టే!

హా—ఓ!

శా—నీపెళ్లాం వాళ్ళమధురగీతాలు వింటుంది!

హా—నమ్మకంగా.

శా—నువ్వు ఆవైభవం కళ్ళప్పగించి చూస్తూంటావు

హా—నిశ్చయంగా.

శా—చి ఛీ. అవతలకిపో. ముసలిచవటా! చవటా ధమా, దద్దమ్మాగ్రణీ! (రాజ్యంతో) నువ్వీపాటి లోపలి కెళ్ళు. ఇల్లాంటి అపవిత్రపుబోధ నువ్వు వినకూడదు.

హా—నేను విశ్వాసం ఉంచి బతికాను. అల్లానే బతుకుతాను. నువ్వు నామాట విని నీ పద్ధతి కొంచెం మార్చుగో. అయిపొంతం, రా, పోదాం!

(వాళ్లు FR నించి నిష్క్రమిస్తూండగా)

శా—హా! ఏమి దాంపత్యం; ఆ స్వాతంత్ర్యం, ఆ అనుకూల్యం, ఆ ఆశలూ, ఆ కోరికలూ—వీళ్ళ ఎదంలా

ఉన్నాయి. ముసిలివరుగు ఆయనా, వన్నెల పిసినికర్ర ఆ అయస్కాంతం! ఆహా! వీళ్ళవల్ల నాకుముప్పే! మా రాజ్యాన్ని ఏ పల్లెటూరేనా పంపించెయ్యాలి.

[ LU నించి వలరాజూ, మాలోకం వస్తారు. శానయ్య LF కేసి చూస్తూనే ఉంటాడు ]

వ—ఒరేయ్, మాలోకం! అదుగోరోయ్, ఆ పిశాచం! వీడే నాప్రేమనిధికి సంరక్షకుడు!

శా—ఈకాలంలో మర్యాదలూ రీతులూకూడా బొత్తిగా పుచ్చిపోయి కుళ్ళిపోయినాయి.

వ—వీణ్ణి కొంచెం హెచ్చరించి వీడి పరిచయం చేసుగోవాలని నా మతం.

శా—పూర్వం యువకులు ఎంత నిదానంగా ఎంత మంచిగా ఉండేవారు! ఇప్పుడు ప్రతీవాడికీ పైత్యం, ఎవడి ఆజ్ఞకీ లోబడడం అంటూ లేదు!

వ—మనం దణ్ణంపెట్టినా చూడనట్టు నటిస్తున్నాడు, దిక్కుమాలాడు!

మా—ఈ కన్ను కనపడదేమో, అల్లావెడదాం, రండి!

శా—ఇక్కణ్ణించి పోవాలి. పట్నవాసం అంటే మా చెడ్డ కోపం వస్తోంది.

వ—ఎల్లాగైనా, వీడి ఇంట్లోకి వెళ్ళాలి.

శా—(కళ్లుమూసుగుని, ఆగి) ఏవో మాటలులా వినిపిస్తే ఆగాను...పల్లెల్లో, దైవకృపవల్ల, ఇటువంటి పోకిళ్లాలు ఉండరు.

మా—(వలరాజుతో) నడవండి!

శా—పల్లెటూళ్ళల్లోనూ వినోదాలుంటాయి, కాని మాంచి హద్దుల్లో ఉంటాయి...నన్నెవడేనా పిలుస్తున్నాడా?

మా—దగ్గిర కెళ్ళండి!

శా—అక్కడికి తుంటర్లు రారు...సిగ్గొయ్యా! మరోడూ!

వ—స్వామీ! మీకు అడ్డొచ్చి మిమ్మల్ని హెచ్చరించినందుకు మీరు ఏమీ అనుకోరుగద!

శా—ఒప్పుగున్నాం.

వ—క్షమించండి. మిమ్మల్ని ఎరుగుండడం అనేది ఉండదే, అది మాకు చాలా గౌరవం, గొప్పసంతోషం, పెద్ద విశేషం. నన్ను మీకు పరిచయపరుచుకోవా లని నేను తహ తహ లాడిపోతున్నాను.

శా—అట్లానే కానీ, భయపడకు, భయపడకు.

వ—మీ విధేయుణ్ణని నలుగురి ఎదటా చెప్పేసెయ్యడానికి వచ్చాను.

శా—సరే. నిన్ను నమ్ముతున్నాం.

వ—నేను మీ ఇరుగు పొరుగునే కాపరం ఉండగలిగినందుకు, నా పూర్వపుణ్యాన్ని నేనే మెచ్చుగుంటున్నాను.

శా—(మెచ్చుగుంటూ) బాగా అన్నావు!

వ—ఊళ్ళో పెద్ద సభట, విన్నారా?

శా—నేను వినను.

వ—ఔర, మీరు ఎంత కుతూహలం లేనివారండీ! కాలం ఎల్లా పుచ్చుతారు?

శా—స్వంతపని మీద, పుచ్చుతాను.

వ—సరిలెండి. సాయంత్రాలు ఏంజేస్తూంటారూ?

శా—నా యిష్టం ఏమిటో నన్ను కనుక్కొని తత్ప్రకారం చేస్తాను.

వ—సమాధానం ఎంత తక్కువ చెప్పారండీ! మీకు ఏమీ పనిలేకపోతే ఆనక వస్తాను. సెలవా?

శా—చిత్తం చిత్తం. దయచెయ్యండి.

[ శానయ్య LM కేసి నడుస్తూండగా, రెండవ తెర పడాలి. ]

వ—(చేతులుకట్టుగుని పచారుచేస్తూ) ఒరేయి, మాలోకం! ఈ జంతువుగురించి నీ అభిప్రాయం ఏమిటి?

మా—వీడికి అనుమానమండీ! ముక్క ముక్క చెప్పాడు సమాధానాలు!

వ—నాకు వీడిమీద వొళ్ళు మండుతోంది!

మా—ఎందుకండీ?

వ—ఎందుకా! నే ప్రేమించిన కన్య ఈ గొడ్డు యొక్క స్వాధీనంలో ఉండి పోవడం తల్చుగుంటే, పిచ్చెత్తి. వీడు శిఖండి, రాక్షసి. ఆ పిల్లని ఖైదులో ఉంచేశాడు భడవ!

మా—అబ్బో నాకు తెలుసునండీ బాబూఇల్లాంటివి!

వ—మరి చెప్పావు కావేం?

మా—ముందు యజమానిగారు సంగతి తెస్తేకదండీ, నోఖరువాడు చెప్పడం! ఆ పిల్ల సంరక్షణ ఈరీతిగా ఉన్నప్పుడు విజయం మందేనండీ!

వ—ఏం విజయమె మోకాని, మూడునాలుగు నెల్లనించి ప్రయత్నించి చూస్తూంటే, ఒక్కమాటేనా ఆ పిల్లని నేను కలుసుగోకుండా కట్టుదిట్టంచేశాడు. వీళ్ళకి నౌఖర్లూ దాసీలూ ఎవ్వరూ లేరుగుడాను!

మా—మీ ప్రేమ ఆ పిల్లకి తెలియ దన్నమాట.

వ—ఎమోమరి, చెప్పలేను. ఆపిల్ల ఎక్కడికెళ్ళినా వీడు సత్తరకాయిలా ఉంటాడుగా! నేనూ వీళ్లైనంత వెం టాడించి, చూశాను. చూసుగోడాలు మాత్రం జరిగాయి! కంటిభాష నమ్మొచ్చా?

మా—కంఠంభాషకూడా ఉంటేనే నయం అండి.

వ—అయితే మరి ఏమిటి దారి?

మా—దారేనా అండి? దారేగా? నాకు తోచ గానే, నే చెప్పేస్తాను. ఆలోచిద్దాం రండి. ప్రస్తుతం, ఇదీ దారి.

(ఇద్దరూ F కి నిష్క్రమిస్తారు)

రంగం-2

శా—(ఎడట-LF నించి కొంచెం కోపంగావస్తూ) తుంటర్లు! వెనకాలే పడడట, రాజ్యం ఎంతనొచ్చు గుంది? వాడిపేరు (కాగితంముక్కతీసి) వలరాజు. పల్చగా, ఎర్రగా ఉంటాడట, ఆ కుంకని చూసేఉంటాను. ఇల్లూ ఈ

సంచులో నీట పోల్చ లేకపోతానా, చెవులు నలప లేకపోతానా! మొహంమీద అనేస్తాను నాలుగూ! (కి నడిచి)

ఇదే ఇల్లు. ఏయ్, ఎవడోయ్! ఇంకా జంకుతా నేమిటీ! ఒరేయ్, ఎవడ్రా ఈయింట్లో! ఈ రహస్యం నాకు తెలిసింతరవాత, పూర్వం దణ్ణాలు వాడు నాకు ఎందుకు పెట్టాడో ఇప్పుడు బోధపడింది. ఎందుకు ఆలస్యం...(వల రాజు తనకేసి వస్తూండగా)

—ఎవడోయి, ఎద్దు మొద్దు స్వరూపం!

వ—క్షమించాలి, మహాశయా!

శా—ఓ. నీకోసమే.

వ—నాకోసమాండీ?

శా—ఆ, కేవలంగా నీకోసమే. నీపేరు వలరాజు కాదూ?

వ—అవునండీ.

శా—నీతో మాట్లాడాలి, నువ్వు సెలవిస్తే.

వ—తమర్ని సేవించడంకంటె నాకు సౌఖ్యం ఏముంటుంది!

శా—కాదులే. నీకు కొంత మేలుచెయ్యాలనే ఊహతో నీ యింటికి రా సాహసించాను.

వ—నా యింటికాండీ?

శా—నీ యింటికే! ఏం అల్లా ఆశ్చర్యపడతావేం?

వ—నా ఆశ్చర్యానికి తగ్గ కారణం ఉంది లెండి. కాని, మీరు రావడం నా కెంత గౌరవం?

శా___సరిసరి. గౌరవాలు దూరంగా పెట్టు ప్రస్తుతం.

వ___లోపలికి దయచెయ్యండి.

శా___అవసరం కనిపించదు.

వ___బతిమాలుకుంటున్నాను, రండి.

శా___మేం ఇక ముందుకి అడుగుపెట్టం.

వ___మీరు చెప్పేది, ఇక్కడే చెబితే తిన్నగా వినిపించదేమో!

శా___మాకు మరి కదిలే సంకల్పం లేదు.

వ___పోనీ, తమచూ లే నెగ్గనీండి. ఒరేయి, మాలోకం వీరికోరికప్రకారం, ఇక్కడికే తే కుర్చీ.

శా___నేను నుంచునే మాట్లాడతాను.

వ___అయ్యో! తమరు...

శా___అయ్యో లేదు కొయ్యో లేదు. వింటావా లేదా?

వ___నిస్సందేహంగా, సంతోషంతో.

శా___విను. ఈప్రాంతాన్ని ఉన్న రాజ్యం అనే ఒక అందమైన పిల్లయొక్క సంరక్షకుణ్ణి నేనని నీకు తెలుసా?

వ___చిత్తం. తెలుసు.

శా___సరే. నీకు తెలుసునుగనక ఆసంగతి నీకు చెప్పను. సరి ఆమె నాకు లక్షణంగా భార్య కాబోతోందని కూడా నీకు తెలుసా?

వ___అల్లాగనండీ! నాకు తెలియదు.

శా___అందుకని ఆసంగతి నీతో చెబుతున్నాను. ఇక ఆవిణ్ణి గురించి యత్నాలు నువ్వు మానుకోడం నీకు మంచిదేమో చూడు.

వ—నా యత్నాలాండీ?

శా—(కొంచెం తీవ్రంగా) అవును, నీ యత్నాలే, నాటకం ఆడకు నా దగ్గిర.

వ—అయ్యో కర్మమా! నేను ఆవిణ్ణి ప్రేమించినట్టు మీతో ఎవరండీ చెబుతా!

శా—నమ్మతగ్గవారే.

వ—అనగా?

శా—అనగానా, కేవలం ఆ అమ్మాయే.

వ—(పరమాశ్చర్యంతో) ఆ అమ్మాయే!

శా—అవును. ఆ అమ్మాయే! ఇంకా ఎన్నిసార్లు చెప్పమన్నావ్? చిన్నప్పణ్ణించి ఎరుగున్న వాణ్ణే తనహృదయం హరించినవాణ్ణే గనక నాతో చెప్పేసిం దీ రహస్యం. నువ్వు నిత్యమూ వెనకాలపడి నేత్రావధానంట, నేత్ర బాణాలతో ఆశుగవిత్వంట! ఆమాత్రం ఆ అమ్మాయి గ్రహించుకోకలిగిందిట. నువ్విప్పుడు దాచి లాభం ఏమిటి? అందుకని, ఆమెహృదయం నాకోసం కేటాయించేసింది గనక, ఇక నువ్వు అనవసరశ్రమ పడకు.

వ—(ముక్కుమీద వేలుతో) ఆవిడంతట ఆవిడే మిమ్మల్ని ఇక్కడికి పంపిందా?

శా—అవును. నీ మనస్సులోని తుంటరిఆ వేదన ఆవిడ గుర్తించి, తనమతం నీకు వెంటనే తెలియపర్చడానికి సంకల్పించు కుందిట గాని, తన బాధవల్ల ఆలస్యంచేసింది. మాట

చెప్పేవాళ్లు లేక, నేనే వచ్చేశాను, తెగేసి నీతో చెప్పేశాను. ఇక బుద్ధికలిగి ఉండు మరో వ్యాపారం చూసుకో!

—మాడాడు పీనుగు! నోరడిపోయింది! ఈ సంగతి రాజ్యంతో చెప్పేస్తాను. (అని తీవిగా LFకి నిష్క్రమిస్తాడు)

వ—ఒరేయి! మాలోకం!

మా—అయ్యా!

వ—విన్నావా వాడిమాటలు!

మా—విన్నానండి, మన కేమీ భయం లేదండీ. ఏదో ఉందండి కమామీషు! మీతో తెగుతెంపులు చేసుకోదల్చిన మనిషి మీకు కబురు ఎందుకు పంపిస్తుందండీ!

వ—అయితే, ఉందంటావ్, ఏదో గ్రంథం!

మా—గ్రంథం ఏమిటండీ, మీరు నాతోనే చెప్పలేదు. మీరు వెనకాలే వెళ్ళారట. కనుసంజ్ఞలు కొట్టారట. ఆవిడ అవన్నీ గమనించారట. ఆవిడికి బాధట. కబురు తేవడానికి మనుష్యులు లేరట. ఆయిన్నే పంపిందట! వ్యవహారంలోకి దింపిందట!

వ—అయితే ఆశ ఉందంటావ్!

మా—నన్నడిగితే విజయం ముందేనండీ!

వ—సరే నడు. (R కి ఇద్దరూ నిష్క్రమిస్తూండగా C2 పోవాలి.)

శా—(LM నించి వచ్చి) ఏయ్!

రా—(మెల్లిగావచ్చి, నిలుగుతూ) ఓయ్!

శా—వెళ్ళొచ్చాను.

రా—ఏమి జరిగింది?

శా—నీ మాటలు చెప్పేశాను. వాటితో వలరాజు గుండె చీలిపోయింది. వాడు అడ్డంగా మాడాడు. ఏమీ ఎరగను ఎరగనంటూ వాడు నసగడం మొదలుపెట్టేసరికి, నేను స్వయంగా తన్ని గట్టిగా ఝాడించడానికి వచ్చానన్నాను. దాంతో వాడికి మాటపోయి, పట్టికొట్టేశాడు. మరి ఈ వీధికి రాడు, నాదిపూచీ.

రా—ఏమో! మీరు అల్లా అనుకుంటున్నారుగాని, అతడు మన్ని ఇంకా బాధించకుండా వదలడని నాకు భయం వేస్తూంది.

శా—ఇటువంటి సందేహం నీ కెల్లాపట్టిందీ?

రా—ఏమని చెప్పనూ! మీరూ అల్లా వెళ్ళారు, నేనూ గాలికోసం వీధికిటికీదగ్గిరికి వెళ్ళాను. ఎవడో, అతడి మనిషి గావును, వచ్చి నన్ను హెచ్చరించి, రివ్వున ఈ ప్రేమ జాబు లోపలికి విసిరి, తుఱ్ఱుమన్నాడు. ఛీ ఛీ ఇది పట్టుగుపో అని నేను కేకలు వేసే సరికి అప్పుడే వీధి చివరికి వెళ్ళాడు. నాకు మనస్సు మనస్సులో లేదు.

శా—(నిర్ఘాంతపోయి) ఆరి తుంటరి వెధవల్లాలా!

రా—ఇదీ వాళ్ళమొహాన్ని గిరవాటుడితేగాని, మన గౌరవం దక్కదు. ఎల్లా?

శా—ఎల్లాగేమిటి? మనస్సు యొక్క నైర్మల్యం నా కిప్పుడు బోధపడింది. నేనే వెళ్ళి వాడి మొహాన్ని కొట్టివస్తాను.

రా—ఇదిగో!

శా—(చింపబోతూ) పోనీ, ఇందులో ఏముందో చూద్దాం!

రా—చింపకండి, చింపకండి.

శా—ఏం?

రా—ఇది నేనే చింపి చూశాను. గావునని అతడను కోడూ! మర్యాదస్తులైతే తమపేరట వచ్చిన ప్రేమజాబులు చింపి చూస్తారా? అట్లాచూడడంకూడా ఏదో ఒక మృష్టకు తూహలం వీళ్ళకి ఉన్నట్టు దాఖలాకదా! అది ఈపళంగా నే తిరగ్గొడితే, మనం దీన్ని ఎంత ఏహ్యంగా చూశామో అత డికి తెలిసొస్తుంది.

శా—నీవు చెప్పింది సహేతుకంగా ఉంది. నీ సుగుణం నన్ను మంత్రిస్తోంది. నా బోధన ఫలించింది.

రా—అయినాసరే, మీరు ఉత్తరం చూడాలంటే చూడండి, మీ చేతులోనే ఉంది.

శా—ఛీ ఛీ దిక్కుమాలిన ఉత్తరం, నే చూడను. నీమాట నచ్చింది. నువ్వుండు, ఇది వాడిమీద పారేసి చక్కా వస్తాను. (LM నించి వెడతాడు, C 2 వెయ్యాలి)

శా—(వెంటనే LF నించి వస్తూ RF కేసి నడిచే సరికి అక్కడికి మాలోకం రాగా) నీ పేరేమిటి?

మా—మాలోకం అండి.

శా—నీ యజమాని వలరాజేనా?

మా—చిత్తం.

శా—వాడు నా రాజ్యంగురించి నిరాశ చేసుకున్నాడా లేదా?

మా—ఆశయావత్తూ వొదులుకున్నారండి. మనస్సు వారిమీదే ఉండేదిట గాని, మీ మూలాన్ని మళ్ళించుకున్నా రండి. ఇప్పుడేమండి?

శా—ఏంలేదూ. వాడు శ్రమపడి మాయింట్లో ఓ ప్రేమ జాబు పడెయ్యించాడులే! అల్లాంటి పిచ్చిపిచ్చి వేషాలు మరివెయ్యవద్దను. ఈ ఉత్తరంమీద రాజ్యం ఉమ్మేసిందని చెప్పు. ఇది చింపనేనా చింపలేదు. ఇల్లాఉంది మీ యజమాని రాత. వాడి భవిష్యం ఎల్లాఉంటుందో చూసుగో మను. (అని LF కి వెడతాడు.)

మా—అయ్యో!

వ—(RF నించి వచ్చి) ఏమిట్రా ఆ బైతు ఇచ్చాడు?

మా—మీరు పేమజాబు రాజ్యంగారికి రాశారట, ఆవిడికి కోపంవచ్చి, చింపకుండా ఈయనచేత పంపించేసిందిట! చింపిచూడండి, నావాదన రైటవునో కాదో!

వ—(ఉత్తరం చింపిచూస్తూ) "ఆరురోజులలోపల నన్ను పెళ్ళిచేసుకుంటానని ఇతడు నాతో చెప్పడంవల్ల నాకు

దారుణభయంవేసి, ఇతనితో పెళ్ళి ఎట్లానేనా తప్పించుకో
వాలని, గత్యంతరంలేక, మర్యాదాతిక్రమణం అనికూడా
చూడక, సాహసించి, నేను మీకీజాబు వ్రాశాను. మీ
హృదయం నామీద ఉంటే ఆ సంగతి నాకు తెలియచెప్పి
నన్ను చేపట్టండి. ఆలస్యం కూడదు. పరస్పరప్రేమగల హృద
యాలకి విస్తారంమాటలు అనవసరం."

మా—మాశారండీ, ఆవిడ ఎంత అపూర్వమైన
పన్నుగడ చేసిందో! ఆ చిన్నహృదయంలో ఇంత ప్రేమప
న్నాగం ఉందని ఎవరనుకోగల్రు చెప్పండి.

వ—ఆవిణ్ణి నేను ఆరాధిస్తాను.

మా—సరేలెండి. మనవాడు వస్తున్నాడు. ఆగండి,
లోపలికి పదండి. (FR కి నిష్క్రమిస్తారు.)

శా—(LF నించి కోపంగా వస్తూ గుండెబాదుకుం
టూ) నేనువెళ్లి రాజ్యంతో ఉత్తరం వలరాజు ఎదాన్నికొట్టా
నని చెప్పాను. పూర్వంనించీ తనయజమానిమనస్సు రాజ్యం
మీదే లగ్నంఅయి ఉండడంచేత, నేను అడ్డునిలవడంవల్ల
మానేశాడు గాని, లేకపోతే తనయజమాని ఈపాటికే రాజ్యా
న్ని వివాహంచేసుకునిఉండేవాడనీ, ప్రస్తుతం అల్లాంటిఆశ వది
లుకున్నాడనీ ఆ మాలోకంగాడు నాతో అన్నమాటలుకూడా
రాజ్యంతోఅన్నాను. ఆమాటలకి రాజ్యం సంతోషిస్తుందను
కుంటే గొల్లుమని ఏడుస్తూ, "అయ్యో! మీరెరగరండీ! మీరు
మంచివారు, వాడుతుంటరి ; మీరు అమాయికులు, వాడు

నటుడు; మీరు జాలిపడుతున్నారు. వాడు గేలికొడుతున్నాడు! వాడు కుట్రదారు. ఆరురోజుల్లో మన పెళ్ళిని వాడి కెల్లాతెలిసిందో, ఈలోపల నన్ను లేవదీసుకుపోతాట్ట! నాగతేమిటి దేముడా" అంటూ రాగాలెట్టింది. అమ్మనీవిణ్ణితగలెయ్యా; కుట్రలుపన్ని రాజ్యాన్ని లేవదీసుకుపోతాట్ట! వీణ్ణి ఏంజేస్తే పాపంఉంది! ఇక కానీకానీ పోనీపోనీ అంటేలాభంలేదు. దీని అంతంచూసేదాకావదిలిపెట్టను. (R F.కి నడుస్తాడు.) ఎయ్!

వ—(వచ్చి) ఏమండీ శ్రీవారు, మళ్ళీవచ్చారెందుకూ?

శా—తమదిక్కుమాలి పన్లమూలాన్ని.

వ—అదేమి స్వామీ అల్లాంటారూ!

శా—(హేళనగా)తమకి తెలుసు స్వామీ అదేమిటో! బుద్ధిలేదూ! పైకితేనెమాటలూ, లోపల దుదుద్దే శాలా! ఎరుగుదువో ఎరగవో, నేను మర్యాదగా ఉన్నంత వరకే! కోపంవస్తే పిబాబునికూడా ఖాతరీ చెయ్యను. పోనీగాని, నీకుసిగ్గులేదుటోయ్, పీటలమీది పెళ్ళికొడుకుని పడేసి, పిల్లని లేవసుకు పోటానికి కుట్రచేస్తున్నావుట!

వ—అయ్యొయ్యో! ఈవింతకథ మీకు చెప్పినవారెవరండీ, మహానుభావా!

శా—నీఅబద్ధానికి, నా అబద్ధం ఎందుకూ! రాజ్యమే చెప్పింది. నీకు సిగ్గుభిడియాలుంటే ఆవిడ హృదయం ఎటుందో నీకు స్పష్టం అయి ఉండాలంది. నాసంరక్షణలోఉన్న తనికి

నీకట్ర వంచన అంది. ఈ వంచనకంటె మరణం నయమంది. ఈ పరిస్థితి తప్పించకపోతే నలుగురూ నాలుగు మాటలు నిన్నే అంటారంది.

వ—మీరారు చెప్పేది యావత్తూ నిజమే అయితే, నాకూ ఋణం చెల్లు. ఆవిడతీర్పు నాకు ఆజ్ఞ.

శా—ఏం నీకు అనుమానమా? నేను నాటకం ఆడు తున్నా ననుకున్నావా? నే అన్నమాటలు అక్షరాలా ఆవిడ బాధలో ఆవిడ అనేసినవే. నాతో రా. సాక్ష్యం ఇప్పిస్తాను. తరవాతేనా తప్పుదిద్దుకుందుగాని. త్వరగా. రా.

(LF కి శానయ్య ముందు నడవగా, వలరాజు వెనకాలే వెడతాడు.)

## రంగం — 3

(C 2 లేవాలి. LM నుంచి ముందు శానయ్యవచ్చి LB కి వెళ్లి, ఒకకుర్చీ తెచ్చి, LF దగ్గర కేసి వేసి, వచ్చిన వలరాజుని అందులో కూచోమంటాడు. అతడి కుడిపక్కని మరోకుర్చీ మీద కూచుంటాడు. 'రాజ్యం' అని పిలుస్తాడు. LB నుంచి రాజ్యం వచ్చి దీర్ఘంతో 'ఓయ్' అని, వీళ్ళ వెనకాల నిలబడు తుంది.)

రా—వా రెవరు?

శా—మన శనిగ్రహం, వలరాజు.

రా—ఆయన్ని ఇక్కడికే తీసుగొచ్చారూ? నాబాధ చాలక, మీరుకూడా ఆయన్తో కలిశారా?

శా—ఛీ ఛీ అదికాదు.

రా—కాకపోతే, నాచేత ఆయన్ని ప్రేమింపచెయ్యడానికి ఆయనప్రజ్ఞ ప్రత్యక్షం చెయ్యడానికా?

శా—(లేచి, రాజ్యంకేసిచూసి) ఛీ. అల్లా అపోహపడకు. అతణ్ణి ఇక్కడికి ఎందుకు తోలుకొచ్చానంటే, నువ్వు నన్ను చెప్పమన్నమాటలు నే వీడితో చెబితే, ఆమాటలన్నీ కాకీపిచ్చికాకథలకింద కట్టేసి వీడు చప్పరించేశాడు.

రా—నేను నాప్రేమ నిస్సందేహంగా మీతో చెప్పలేదూ?

శా—చెప్పకేం, చెప్పావు. నేనూ నిశ్చేషంగా అంతా వీడి దగ్గిర ఏకరెట్టాను. నమ్మడే. పీనుగూ! వీడి రోగం ఇల్లాఉందా అని, ఈవ్చుగు చక్కావచ్చాను.

రా—ఔరా! నాచిత్తవృత్తి ఇంకా శంకించడమేనా?

వ—అమ్మాయిగారూ! ఒక మాటవినండి. ఈ పెద్దమనిషి మీతరంపున చెప్పింది నాకు అద్భుతంగాఉంది. నేను వాస్తవంగానే శంకించాను. మీ చివరతీర్పు మళ్ళీ ఓమాటు మీనోటంట విని పోదాం అని నేవచ్చాను.

రా—మీకు అల్లాంటతీర్పు అద్భుతంగాతోచి ఉండకూడదు. అది సహజం. ఆయన మీతో చెప్పింది యథార్థం.

శా—విన్నావా? (అని కుర్చీలోకూర్చుని వలరాజుకేసి చూసి మీసందువ్వుతాడు.)

వ—చిత్తం.

రా—హృదయపూర్వకంగా నేను మాట్లాడేటప్పుడు, జనానికి తెలిసితీరాలి, జనం నన్ను నమ్మి తీరాలి. ఇప్పుడు నాకర్మం రెండింటాల వచ్చింది. ( చేతులతో కేటాయించి చూపిస్తూ ) ఒక పక్షం నాకు గౌరవం. రెండవది అగౌరవం— ఇటుమన్ననా, అటూ నిరసనా. ఈవైపు భక్తి అనురాగాలు, ఆవైపు భయద్వేషాలు. ఒకటి ఆనందదాయకం, రెండవది దుఃఖభాజనం. ఒకపక్షం నాకు జీవం, రెండోది మరణం! నే పడ్డబాధ చాలు. వీరిలో నాప్రేమనిధి అయినవారు తక్కువ వారైన నా ద్వేషిని ఇక సాగనంపెయ్యాలి.

శా—( లేచి ) నా చిట్టి! సాగనంపుతా.

రా—అదొక్కటే మార్గం, నాకు సౌఖ్యం కలిగించాలంటే.

శా—( మీసం దువ్వుతూ ) నే చెబుతాగా!

రా—నోరులేనిదాన్ని రచ్చకెక్కిస్తున్నారు గదా!

శా—భయంలేదు, భయంలేదు. నే నేమీ అనుకోను. నీ చిక్కు అల్లావచ్చింది.

రా—నాహృదయంలో ఈవరకే నేను భర్తగా భావిస్తూన్న వ్యక్తి నన్ను క్షమించకపోతారా?

శా—క్షమించడం ఎంతసేపే, వెర్రిపిల్లా, నాహృదయానికి అలంకారమా!

రా—ఇన్నెందుకు, తమప్రేమ తమరు సార్థకం చేసుకోవాలి గాని!

శా—ప్రేమ సార్థకమా? ఇదుగో (అని గాలిలో ముద్దు).

రా—అదిసరి. మరి ఆలస్యంలేకుండా వివాహం జరిగిపోతే, రెండో వాళ్ని స్మరించనే!

శా—ఓసి వెర్రిదానా! యావత్తూ బోధపడింది. నీ బాధలు తీరాయి. నన్ను గురించి నువ్వు ఎంతకృశిస్తున్నావో తెలిసింది. చూడు నా తడాఖా.

వ—అమ్మాయిగారూ! నాకు తెలిసింది. బుద్ధివచ్చింది (లేచి వినయంగా) మీచేత అంతగా ద్వేషింపబడేవ్యక్తి మీనుండి దూరంకావడానికి ఏంచెయ్యాలో ఆపని చేస్తాను.

శా—అదే నేనుకోరేది.

రా—అదే నేనూ కోరేది. (కళ్ళుమూసుకుని) ఆవ్యక్తిని నేను మనసారా ద్వేషిస్తాను, ఆవ్యక్తి అంటే నాకు భయం, జగుప్స, ఏహ్యం.

శా—అవునవును, రోత, డోకు, వాంతి.

లా—నే నిల్లా మాట్లాడ్డం మీకు కష్టంగా ఉందా?

శా—కష్టమా? నాకు పరమానందంగాఉంది. నీకేది అయిష్టమో ఆసంగతి నువ్వు చచ్చు తెగేసి స్పష్టంగా చెప్పేశావు.

రా—ఇల్లాంటి ఒడుదుడుకుసందర్భాల్లోనావంటిదిఇంత కంటె స్పష్టంగా ఎల్లాచెప్పగలదు?

వ—సెలవు. ఇక మూడు రోజుల్లో మీరు అంతగా ద్వేషించే వ్యక్తిని మీరు మరి చూడరులెండి.

రా—అట్లా జరగాలిగా! దయచెయ్యండి మరి!

శా—ఎంత దురవస్థ వచ్చిందోయ్ నీకూ! ఏవిషమో పుచ్చుకుంటాడుగావును!

వ—ఇక నేను కిక్కురు మననండి. శ్రీమతిరాజ్యం గారు మీకూ నాకూ కూడా న్యాయం సెలవిచ్చారు. ఆవిడ సెలవుప్రకారం నాపని మీద నేపోతాను. సెలవ్, సెలవ్! (అంటూ L U కి నిష్క్రమిస్తాడు.)

శా—వెర్రికుంక! ఎందుకొచ్చింది, లేనిపోని హైరానా, గొంతెమ్మ కోరికలూనూ! తిన్నగా ఉండకూడదూ!— రాజ్యం! వాణ్ణి చూస్తే నాకు నిజంగా జాలివేస్తోంది!

రా—సింగినాదం. అతణ్ణి గురించి జాలి అవసరంలేదు.

శా—సరి యిక వాడు గతించాడు. మన కెందుకు గాని, నీకోరిక ప్రకారం, మన వివాహం వెంటనే కానిద్దాం. ఏారం ఆలస్యంవద్దు. రేపే మనపెళ్ళి. పెళ్ళి చెయించేవాణ్ణితప్ప ఎవణ్ణీ పిలవను.

రా—రేపా?

శా—అవును రేపే. తీరా పెళ్ళి అనే సరికి సిగ్గొచ్చి నువ్వు అల్లా అంటున్నావుగాని, నీకు మనసులో ఎంత కుతూహలంగాఉందో నే నెరగనా?

రా—కాని...

శా—అబ్బే: మరేమీ లేదు. ముహూర్తానికి ఏర్పాట్లన్నీ చేసేస్తా. నువ్ లోపలికి నడు. (అని హడావిడిగా RM కి పోతాడు).

రా—(తనలో) హా! దైవమా! నాకు మరి దారి ఏమిటోగదా! (LM కి నిష్క్రమిస్తుంది—తెర).

రంగం - 4

[ రాజ్యం ఎక్కడికో పనిమీద వెళ్ళడానికి సిద్ధమైనట్టు LM నించి రావాలి. )

రా—ఈ శౌనయ్యతో దిక్కుమాలి బలవంతపు వివాహంకంటె నాకు మరణం శతవిధాల సుఖం అని తోస్తోంది. నాయందు తప్పుపట్టబోయేవాళ్ళు నా అవస్థచూసి నాపన్లకి నన్ను క్షమించాలి. కాలం జరిగిపోతోంది. రాత్రి వచ్చిపడుతోంది. నా అదృష్టం అంతా నేను వరించిన అతడి విశ్వాసంలో ఉంది.

శౌ—( RM నించి గబగబావస్తూ ) ఇదుగో రాజ్యం! వచ్చేశాను. రేపటికి సర్వం సన్నాహం చేశాను.

రా—( తలలో ) అయ్యో! వచ్చిపడ్డాడీ రాక్షసి!

శౌ—నువ్వేనా, ప్రేయసీ! ఎక్కడికో బయల్దేరావ్ ఆలస్యంగా! వంట్లో ఎల్లానో ఉంది, ఇంట్లో విశ్రమిస్తా నన్నావ్, రేపటి దాకా!

రా—అన్నాను, అంటేం?

శౌ—ఏం జరిగింది?

రా—ఏం జరిగిందా! ( అని కంగారుపడి ) చూశారా నా కంగారు! మీయెదట ఏమిక్షమాపణ చెప్పుగోనాలని సందేహిస్తున్నాను.

శౌ—చెప్పు చెప్పు-చెప్పు, ఏమొచ్చిపడింది?

రా—పరమ రహస్యం.

శౌ—( శబ్దం చెయ్యకుండా ) ఏమిటది?

రా—మా అక్క అయస్కాంతమే, నేను, ఇప్పుడు బయటికి బయల్దేరిన కారణం.

శా—ఔర తుంటరీ! ఏంచేసింది అయస్కాంతం?

రా—(నిమ్మళంగా అన్నట్టు సంజ్ఞ చేసి) తన పన్నాగం ఏదో ఉందిట. నాగది తనకి కావాలని వచ్చి కూచుంది. నాకు బొత్తిగా ఇష్టంలేదు. ఆవిణ్ణి లోపలుంచి ఇల్లావచ్చాను.

శా—దాని పన్నాగం ఏమిటే!

రా—మీరు నమ్ముతారో లేదో, మనం పేణ్ణీళ్లుకొట్టి సాగనంపామే ఆ ఘటం ఆ వరుణ్ణి మా అక్క ప్రేమిస్తోంది...

శా—వలరాజుగాణ్ణి!

రా—చచ్చేలాగ ప్రేమిస్తోంది. ఇంత దళసరి ప్రేమ ఎక్కడా చూళ్ళేదు. అది ఎంత ఉపద్రప్రేమా కాకపోతే మా అక్క ఈపాటప్పుడు ఇక్కడికి తన ప్రేమశోకన్నాలు నాదగ్గిర పెట్టడానికి వస్తుందా? అతడితో వివాహం కాకపోతే ఉరెట్టుగుని చచ్చిపోతుందిట. ఏడాదినించి వీళ్ళప్రేమలు సాగుతున్నా తీవ్రంగాయిట. మొదటినాడే నిశ్చయించుగున్నారుట వివాహం!

శా—ఓరి దగుల్బాజీకుంక వల్రాజూ!

రా—ఈ రాత్రి నా కిటికీ పక్కసందులో అతణ్ణి చూస్తుందిట, అతడితో మాట్లాడుతుందిట. నామీదకాదూ అతడు ప్రేమ వెనక చూపించాడూ, అందుకని, మా అక్క నా వేషంలో, నా చెప్పులు తొడుక్కుని, నా వయ్యారం స్వీకరించి, నాలాగే వెళ్ళి అతడికి కనిపిస్తానని కూచుంది. నా గొంతికలాగే పెట్టి మాట్లాడుతుందిట కూడానూ!

శా—దీనికంతకీ నువ్వు అమోదించావా?

రా—ఆమోదిస్తానా? మండిపడ్డాను, మా అక్కకి గడ్డిపెట్టాను. నీకేమన్నా మతిచెడిందా, మిణుగురుపురుగునా వలుస్తున్నావ్, దేవుడు నీకు నియమించిన నీ యజమానిని, హయగ్రీవంగారిని మోసపుచ్చడం ధర్మమా అన్నాను.

శా—వాణ్ణి మోసపుచ్చవలిసిందిలే. నాకు ఎల్లా ఉందీ, పండుగలా ఉంది.

రా—నేను కూడదని లక్షవిధాల చెప్పిచూశాను. మా అక్క ఏకగోల, ఏకపడుపు, ఏక మొత్తుగోడం, ఏక దొర్లిపోడం. పైగా చచ్చిపోతానని కూర్చుంది. నేను ఒప్పుగుని తీరవలిసొచ్చింది. ఈ పక్క ముసలమ్మ మంచి దంటూంటారే మీరు, ఆవిణ్ణి సాయం పడుకోడానికి పిలుద్దామని వెడుతున్నాను, మీరూ ఇంతలో వచ్చారు.

శా—ఈ రహస్యపన్నాగాలు నా కొంపలో నేను ఎంతమాత్రం ఒప్పను. మా అన్నకి తగ్గ బుద్ధి చెప్పడానికి ఒప్పుకోవలసిందే కాని, ఎవళ్ళైనా ఇది కనిపెట్టగలరు. మనం అనుమానం భరించగలమా - ఛీ. తరిమెయ్ ఇంట్లోంచి ఈ పాడు వ్యక్తిని...

రా—మీరింత కోపం కనపరిస్తే, మా అక్కకి మూర్ఛవచ్చేస్తుంది. తరవాత నన్ను అనుమానిస్తుంది. క్షమించండి. అవతలకి ఆవిణ్ణి పంపేసేదాకా నిమ్మళించండి.

శా—సరే. బాగానే ఉంది, అల్లాకాని.

రా—మీరు కొంచెం దాక్కోండి. దయఉంచి అది వెళ్ళేటప్పుడు దాన్ని పలకరించకండి!

శా__సరే. నీమీది మనసువల్ల దానిమీద కోపం చంపుగుంటున్నాను. మా హాయగ్రీవాన్ని పిల్చుగొస్తాను. ఈ దృశ్యం వాడికి చూపిస్తే, దీనికి వాడు నవ్వుతాడో ఏడుచుగుంటాడో చూడాలి!

రా__నామాట ఏమీ చెప్పకండి వారితో. సరే.__ నేనూ లోపల విశ్రమిస్తాను.

(అంటూ LM కి వెళ్ళి పక్క తెర దగ్గరికివచ్చి, శానయ్య చెవిఒగ్గి వింటూండగా, గట్టి గొంతికతో!

"అక్కయ్యా! నీకు ఆశాభంగం చెయ్యవలిసొచ్చింది. నువ్వన్నప్రకారం చెయ్యడం అసంభవం. నా మర్యాద నేను చూసుగోవాలిగదా. ఇదిగో నా వేషం, నా జోడు! దయచెయ్! ఈవటికి ఇంటికి నడు శీఘ్రంగా"!

(ఒకవ్యక్తి రాజ్యం జోడుతో, రాజ్యం ముసుగుతో, తల టెక్కింపుతో LM నించి మెల్లిగా RB కేసి మొహం కనపడకుండా నడిచి పోతుంది.)

శా__అమ్మా! ఈ అయస్కాంతం పిరగడ అయిపోయిందిరా, బాబూ! మళ్ళీ మాయింటికి వస్తుందేమో ఇంటికి పైన తాళంవేస్తాను. (వేసి వచ్చి, RM కేసి పరకాయించి, RF కేసి చూసి,) ఏముంది తిన్నగా వలరాజు ఇంటికేసే దారెట్టింది. ముందు నేవెళ్ళి మా హాయగ్రీవాన్ని పిల్చుగొస్తాను. ఈ సంగతి చూసి మెచ్చుగుంటాడు.

(అని LF కి నిష్క్రమిస్తాడు.)

(RF ని వెనకనడకలో ఒక అంగ వలరాజువచ్చిRF దగ్గిరనుంచున్న ముసుగుతో రహస్యంగా,)

వ—(ష్ష్ అని ధ్వనిచేసి) ఏయ్, రాజ్యం, ఇక్కడ! ఇటు! గట్టిగా మాట్లాడద్దంటావా! వివాహం ఏర్పాటు చెయ్యాలంటావా? అవశ్యం! వివాహం రేపు. నిర్భయంగా నా యింట్లో ఉండు.

[LF దగ్గిరికి శానయ్య వస్తాడు.]

శానయ్య అయేది వాడి తాత అయేది వచ్చి నిన్ను ఇక్కణ్ణించి తీసికెళ్ళలేడు. శానయ్యని పొడిచేస్తాను. గుండె పిండికొట్టి అట్టు తిరగేస్తాను, రాజ్యం.

శా—వెర్రిపీనుగు రాజ్యం అనుకుంటున్నాడు. ఈ సిగ్గుమాలిన అయస్కాంతాన్ని నువ్వే పెళ్ళిచేసుకోవోయ్! ఇది ఎవడికి కావాలి! (వెనక్కితిరిగి) రావయ్యోయ్ పెద్దన్నయ్యా! నడవలేక వెనకబడ్డావ్! నీ ట్రైనింగ్ ముచ్చట చూద్దుగాని!

హా—(కళ్ళు నలుముకుంటూ) ఏమిటి తమ్ముడూ? ఎందుకూ?

శా—ఆ, మరీ! గొప్ప తమాషా చూబిస్తాను. రా.

హా—తమాషా అంటే?

శా—అంటే శుభవర్తమానం, జయమంగళం.

హా—దేన్ని గురించి?

శా—మీ అయస్కాంతం ఎక్కడికెళ్ళింది?

హా—నీకెందుకూ? స్నేహితులింటికి టీపార్టీకి వెళ్ళింది.

శా—అల్లానా? ఆ మరి. ఎవరింటికి టీపార్టీకి వెళ్ళిందో కళ్ళారా చూద్దుగాని!

హా—ఏమిటి నువ్వు చెప్ప దల్చింది?

శా—అనుమానాలూ, తాళాలూ, గడియలూ సుగుణాల్ని పెంచవని నాతో వాదించావు. దయవల్ల నెగ్గచ్చు, కరుకుతనం కూడదను, స్వాతంత్ర్యం అందరికీ ఇష్టం, తప్పులు ఒప్పుకోవాలంటూ పెద్దకబుర్లు చెప్పావు. అందువల్ల కలిగే ఫలితం, సుగుణం చూద్దుగాని!

హా—ఏమిటీ ఉపన్యాసం?

శా—జయం, జయం అన్నగారికి! నువ్వే నీకొంప ముంచుకున్నావు! మన ట్రైనింగుల తేడా ప్రత్యక్షం అయింది. ఆ యిద్దరు స్త్రీలలోను ఒకరు జనాన్నించి తప్పుకున్నారు, ఇంకొకరు జనం వెనకాల పరిగెడుతున్నారు!

హా—ఈసమస్య ఏమిటో నువ్వు విప్పి చెప్పాలి.

శా—సమస్య ఏమిటంటే, శ్రీయుత వలరాజు గారింట్లో పార్టీ, వలరాజుగారి ఇంట్లోకి ఆవిడ స్వయంగా, దయచేసింది. అక్కడ ఇప్పుడు మనచేత దొరకబడుతుంది.

హా—ఎవరు?

శా—అయస్కాంతం.

హా—వేళాకోళమా?

శా—వేళాకోళమా!... వేళాకోళం ఆడ్డం వేళాకోళ మనుకున్నావా? ఓరి ధవ్వా, నీఅయస్కాంతం వలరాజుతో వెళ్ళిపోయిందోయ్! వెనకే వాళ్ళకి అగ్రిమెంటు జరిగిందట.

హా—ఈకథ నమ్మతగ్గది కాదు.

శా—నీకళ్లతో చూసినా నువ్వు నమ్మవు! వృద్ధుడవ్! పాపం! నీనెత్తిమీదికివెళ్ళువచ్చిపడ్డకొద్దీ నీబుఱ్ఱగుంజు కొట్టుకుపోయింది.

హ—మహాప్రభూ! నన్ను ఇప్పుడు ఏంజెయ్యమంటావ్?

శా—ఈ వేపురా.

హ—వస్తాను. అయస్కాంతం ఎదేనా దారితొక్కితేనా, నాతో చెప్పకుండా ఉంటుందా? ఆవిడయిష్టం అవిడదే అని నేడు లక్షమాట్లు ఆవిడతో చెప్పాను. నీకథ నేను నమ్మను.

వ—(LF పైనుంచి తలమాత్రం కనపడచి) ఎవరు వారు?

శా—నేను శానయ్యగారిని, వీడు మాఅన్నయ్య హయగ్రీవం, వయస్సు అరవై

వ—అయినాసరే నేను తలుపుతియ్యను. నన్ను మీారెరుగుదురు. నేను ఈ పిల్లని వివాహం చేసుకుంటాను. అందుకు మీారు ఒప్పుకుని తీరాలి. అంతే. నే ప్రాణమేనా వదుల్తాను గాని, ఈపిల్లని వదలను.

శా—వదలకోయ్ వదలకు. నీపొరపాటు నీకు తెలిసింతరవాత ఏడుస్తుగానిలే!

హ—ఆ పిల్ల అయస్కాంతమా?

శా—ఊరుకో!

హ—మరి!

శా—నోరుముయ్!

హా—ముందు నాకీ సంగతి......

శా—అరే, ఏమిటాగోలా? నోరునొక్కుగుంటావా లేదా?

వ—ఏమట జరపండి. రాజ్యంనాది, నేను రాజ్యం దాసుని. నేను తగనంటారా, రాజ్యానికి?

హా—తమ్ముడూ! అతడు 'రాజ్యం' అంటున్నాడే!

శా—దానికి చాలాగ్రంథం ఉందిలే. ముసిలి పీనుగువి నీకేం తెలుసు! (పైకిచూసి) ఏమోయ్! అబ్బాయి! గడబిడ ఎందుకూ! నీదగ్గిరున్న పిల్లని నువ్వు వివాహం ఆడడానికి మేం ఇద్దరం ఒప్పుగుంటున్నాం! ఏరా అన్నయ్యా, మనం ఒప్పుగోడం లేదూ!

వ—సరే (అని నిష్క్రమిస్తాడు).

హా—అభ్యంతరం ఏముంటుందీ? ఇంత పట్టింపు ఎందుకొచ్చిందీ అసలూ? కాని, అతడు రాజ్యం అంటాడు, నువ్వు అయస్కాంతం అంటావు!

శా—అయస్కాంతం అయితే మాత్రమేం, ఆవిడ స్వతంత్ర ప్రవర్తనగురించి నీకు ఏవిధమైన బాధా ఉండదని నువ్వు అంటావుగా!

హా—ఇప్పుడూ అంటాను.

శా—అయితే ఒప్పుగో! నేనూ ఒప్పుగుంటాను.

హా—సరే. ఏముటో మిథ్యగా ఉంది.

శా—ఈ మిథ్య క్షణంలో తేలిపోతుంది.

[ నించి అయస్కాంతం ఉస్సూరుమంటూ వస్తుంది. ]

అ—ఇదుగో ఇక్కడున్నారు! (హయగ్రీవంతో) ఏమండీ ఇక్కడున్నారెందుకూ ?

హ—ఎందుకేమిటి? నాకు కోపంలేదు గాని, ఒక్కటి అడుగుతాను చెప్పు. ఎప్పుడూ నీ హృదయస్వాతంత్ర్యం నీదే అన్నానుకదా, నాకు తెలియకుండా, నాతో చెప్పకుండా, నువ్వు మరోరికి నీమనస్సు ఇచ్చేసెయ్యాలా, నా హృదయం నీకర్పించి నందుకు ఇదా ఫలితం?

అ—మీా రనేది ఏముటో నాకు బోధపడటంలేదు. నేను ఎప్పుడూఉన్నట్టే ఉన్నాను గాని మారలేదు. మీా మీాద నాకుగల భావం ఎవ్వరూ మార్చలేరు. మీాకు నా మీాద అనుగ్రహం ఉంటే, రేపు నన్ను వివాహం ఆడండి.

హ—తమ్ముడూ! మరి నువ్వు అల్లా ఎల్లా చెప్పావురా నాతోటీ ?

శా—అయితే, అయస్కాంతం! నువ్వు ఇల్లాతిరిగి వలరాజు ఇంట్లోంచి రాలేదూ? అతణ్ణి పెళ్లాడతానని సంవత్సరం కిందట అతడికి వాగ్దానం చెయ్యలేదూ? మీాకు అగ్రిమెంటు కాలే!

అ—అబద్ధాలు గుచ్చెత్తి ఎవరు నీతో చెప్పింది ఈ కట్టు కథలూ!

[illegible]

[ RF నించి ముందు వలరాజూ, వెనకాల రాజ్యం వస్తారు. LF కేసిఉన్న అయస్కాంతం కేసి రాజ్యం వెడుతుంది. వలరాజు RF దగ్గిరే చేతులు ముడిచి నుంచుంటాడు. LM దగ్గిర నోరు తెరచుగుని శానయ్య ఉంటాడు. MM కీ LM కీ మధ్య హాయగ్రీవం ఉంటాడు. ]

రా—అక్కా! నన్ను క్షమించు. నీపేరు నేను స్వతంత్రించి వాడుకున్నాను. అవసరం తొందరలో ఈపన్నాగం నాకు తోచింది. గత్యంతరం కనిపించలేదు.

(శానయ్యతో) అయ్యా! నాహృదయం తమది కాదు. మీ హృదయానికి నేను తగనని నాకు తోచి నేను ఇల్లా చేశాను. మీ బాధ తప్పించుగున్నాను, ఒకర్నినమ్ముకున్నాను.

వ—ఆ ఒకరు నేనయినందుకు ధన్యుణ్ణి.

హా—తమ్ముడూ! పాపం నువ్వు ఏమీ అనుకోకు! ఇల్లావస్తూంటుంది. నీ ట్రైనింగే నీకీ స్థితి తెచ్చింది. నీకింత చిక్కొచ్చినా, ఎవ్వడికీ జాలీనా లేకుండా చేసుకున్నావు.

అ—రాజ్యం! నీపన్నాగం, అభినందించ వలసిందో కాదో చెప్పలేనుగాని, నిందించ వలలిసిందిమాత్రం కాదు.

మా—(RF నించి కొంచెం వచ్చి) శానయ్యగారు ముందుముందు రాగల సంబంధాల్లోకూడా ఇల్లానే చవట రకంగా తయారయే సూచన్లు కనిపిస్తున్నాయి. వారు భర్త ట్రెయినింగు పొందాలి.

హా.—మాయింటికి రండి. శానయ్యకి కోపం తగ్గుతుందిలెండి. ( అంతా L F కి నిష్క్రమిస్తారు. )

శా—( కోపంగా ) ఛీ! ఇంత స్వామిద్రోహమా. ఆవ్యక్తిని నేను ఎంతనమ్మాను? ఛీ! ఈజాతిని నమ్మకూడదు! అధమం ఇక్కణ్ణించేనా నమ్మకూడదు, ఇదుగో నా శపథం! నేఘు నాజన్మలో పెళ్లి ఏమాత్రం చేసుగోను! అదికాక విల్లు రాసేస్తాను. పెళ్ళనేది నాసంతానంలో ఎవ్వళ్ళకీకూడా వల్లకాదని!

( అని R M కేసి ఠీవిగా పోతాడు. )

సంపూర్ణం

